# శ్రీదేవీ భాగవతము



౧-౨-౩ స్కంధములు

కవిసమ్రాట్

నోరి నరసింహశాస్త్రి



సాహితీ సమితి రేపల్లె

రు. ౫/-



జగద్గురు శ్రీ కల్యాణానందభారతీ మహాస్వామి పూజ్యపాదులు

# శ్రీ సూక్తి

శ్రీ మహాస్వామి కల్యాణ దేశిక పూజ్యపాదుల సంకల్పశక్తి సహస్రపద. దేశనాస్రోతమున నా శక్తి సామయిక సంప్రదాయ శిష్యానుగతమై విరాజిల్లును. దీక్షాస్పృష్టికనాటినుండి సహస్రశీర్ష మయిన శక్త్యుల్లాసము మంత్రచైతన్య మను భావ్యను చేయును. జనుఃకర్మవిశేషము లొకటొకటి కలసి చైతన్యస్ఫురణము నీతి రీతి గతి మతుల స్ఫురిత స్ఫురితము చేయును. నోరి నరసింహశాస్త్రి, మహాస్వామి చరణ సన్నిధిని స్వస్పందసుందర మగు హృదయసంవాదముతో మంత్రచైతన్య ధారాసార మనుగత మధిగతము చేసికొని భంగీభణితిభూషితుడై విజ్ఞాని యయ్యెను. నోరి విజ్ఞానితలో గురుకటాక్షస్వీకృతి విశిష్టత నిదానము.

ఈరచన "దేవీకృతచోదనము, ఆత్మాచార్యానాదేశము." అప్రతిగృహీత, అశ్రాద్ధభోజి, అలుప్తవినయుడు నరసింహశాస్త్రి దేవీపూజానిత్య పవిత్రపాణి, శ్రీదేవీ భాగవతము రచయిత. దేవీభాగవతము మహాపురాణము. పురాణ మర్థప్రవణము సుహృత్సమ్మతము నని సహృదయుల హార్దభాష. ఈరచనలో నరసింహశాస్త్రి ప్రత్యభిజ్ఞేయములు చేసికొనిన శబ్దార్థములు పురాణార్థపరతంత్రము లగుట కింత ప్రసాదము కలవైనవి. పురాణార్థము గంభీర మయినను తగిన ప్రసన్నత కలిమి జాపక పాఠకులకు గాంభీర్యవేదిత నీయగలదు. రామాయణము గేయపాఠ్యమధురము. ఇదియు గేయసంపద పాఠ్యసంపద కలదై వాసించును.

శ్రీ వ్యాసభట్టారకుడు సర్వామ్నాయసార మగు గాయత్రిని శ్రీదేవీ భాగవతమున నిరూపించెను. అనుపనీతుల కపరిచితము, నుపనీతులకు సుపరిచిత మయిన గాయత్రి ప్రకటరూప. గుప్తభావ గాయత్రి దేవీదీక్షితులకే తెలియును. నరసింహశాస్త్రి దేవీదీక్షుడు. గాయత్రీసంపద కల దేవీభాగవత మాంధ్రమున నాభా షించుట నరసింహశాస్త్రికే తగును. ఆదేవీభావనులు, ఇతరేతరపారమ్య మంగీకరించు నభినివిష్టులు, దేవీసమయాచార విచారచతురులు, దేశనానధికృతులు, కవియశః ప్రార్థులు దేవీభాగవత మన్యరీతిలో పలుకుట దేవీసంకల్పము కాదు. ఈ నిశ్చితము దేవీభాగవతరచయిత వ్యాసుని హృదయంగతము. కావుననే నరసింహశాస్త్రిరచన "దేవీకృతచోదనము".

సంస్కృతభాషా నిబద్ధము లయిన గ్రంథములు నిత్య పారాయణ యోగ్యములు. అట్టి యోగ్యత కా కర్తల విశిష్టత హేతువు. ఆంధ్రభాషలో పారాయణ యోగ్య గ్రంథ ముదయింపలేదు. నరసింహశాస్త్రి యట్టి గ్రంథ ముదయింపజేసినాడు. ఇంటింట నోట నోట శ్రీదేవీభాగవత మిక వెలసి తీరును.

శ్రీ దేవీభాగవతమును శ్రీదేవీభాగవతముగా జూచి శ్రీదేవీభాగవతులు శ్రీదేవీభావ రతు లగుదురుగాత!

"శ్రీ కల్యాణ గురోః సాక్షాత్ దీక్షాం దైవీ మవాప యః,
తస్యేయం కృతిన స్సార్థా లోకే జీయా త్కృతి స్సదా."

జమ్ములమడక మాధవరామశర్మ

వికృతి నిజాషాఢ శుద్ధ
పంచమి, గురువారము

---

# కృతజ్ఞత

ఈ గ్రంథ ప్రచురణమునకు నన్నుం బ్రోత్సహించిన శ్రీ జమ్ములమడక మాధవరామశర్మకును, దీనిని నిర్దుష్టముగ సిద్ధము చేయుటకు నాకు సర్వవిధముల సహాయపడిన శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రికిని నేను కృతజ్ఞుండను.

నోరి నరసింహశాస్త్రి
రేపల్లె

వికృతి నిజాషాఢ
శుద్ధ పంచమి

---

# విషయ సూచిక

## ప్రథమ స్కంధము



## ద్వితీయ స్కంధము

## తృతీయ స్కంధము

ఉ. జానకి లక్ష్మి, లక్ష్మణుఁడు చంద్రుఁడు, మారుతి రత్నమూర్తియున్,
భానుసుతుండు కల్పకము, వారణ మంగదుఁ డైన దుగ్ధపా
థోనిధి రామకీర్తికథ, ధూర్వహుఁడై స్మృతిమందరంబుగాఁ
బూని మథించు నాదికవిఁ బూజితుఁ జేసెద వాక్సుమంబులన్. ౭

తే. కవులవాక్సుధ తెలుఁగునఁ జవులు గొలుప
మొదల దొరకొన్న ఋషి నన్నపదము మ్రొక్కి,
హరికథాకీర్తనాలాప నామృతార్తిఁ
దన్మయుం డయి వెలుఁగు పోతన్నఁ గొలుతు. ౮

తే. గంగను సముద్ధరించిన ఘటము లెంతె
పిన్న వయ్యును, మహామునిఁ బెద్ద వనుచు,
నేను నా చిన్నదోయిట నించి కొలువఁ
గడఁగువాఁడ శ్రీదేవిభాగవతగంగ. ౯

శా. శ్రీదేవీ యను నక్షరత్రయము మజ్జిహ్వాగ్రవీథిన్ సదా
పాదన్యాస మొనర్చి ధింధిమి యటం చాశ్చర్యహారముల్ సల్పఁగా,
నా దేహంబు త్రివిక్రమక్రమ విశాలీభూత్య విశ్వాకృతిం
పైఁ దీపింపదె, నిండదే మనసు పూర్ణానంద దుగ్ధాబ్ధులన్! ౧౦

## అవతారిక

వ. అని శ్రీదేవీధ్యానావధానంబునఁ గృష్ణద్వైపాయనమునిని భావించి
పరాయణుండనై, శ్రీమద్రామాయణ మహాభారత భాగవతంబులు
నొడువక నుడులకు జనిజనితమం బెడలు టెట్లు సాధ్యపడు నను చిం
మనీష నుండు నే నా సంహితాత్రయం బేకంబై కూర్పొందిన శ్రీదేవీ
భాగవతంబు నాంధ్రీకరింపఁ బూనిన నిమిత్తాదికంబు లభివర్ణించెద.

శా. శ్రీదేవీపదవృత్తి నొక్కతఱి నే శ్రీచక్రరాజార్చనా
ప్రామక్ష్యాత సుశాంతితో గురుపదద్వంద్వంబు చింతించి, శ్రీ
పాదాంభోజపవిత్ర తీర్థము గ్రహింపం బోవ నా కయ్యెడన్
శ్రీదేవీభగవత్కథార్థము స్ఫురించెం బెల్లుగం జెప్పఁగా. ౧౧

వారికి సాష్టాంగ నమ
స్కారం బొనరించి సెలవుఁ గైకొంటిని నేఁ. ౧౮

వ. నా యంగీకరించు శ్రీదేవీభాగవతకృతి కృతినాథు లగు శ్రీవిద్యా
శంకర పదయుగావేశ ప్రకాశిత జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీ
స్వాముల వారి పవిత్రాన్వవాయం బెట్టి దనిన— ౧౯

## కృతినాథ వంశ వర్ణనము

శా. ఆ నారాయణుఁ డాదిదేవుఁడు పరుం డాదిన్ వినెన్ బ్రహ్మసూ
త్రానే యీ సకలమ్ము, లే దితర మొం డేదే సనాద్యమ్ముగన్
జా నొప్పారిన దేవివాక్యములు; దానం జేసి యీ దేవుఁడే
శ్రీనాథుండు జగద్గురుం డనెడి వాసిం గాంచె శ్రీచక్రిన్. ౨౦

శా. శ్రీచక్రాభ్యసినాభికంజమునఁ దోఁచెన్ స్రష్ట; యాతప్రాభ్యాస్యగన్
వాచోధీన సమస్తవేదుఁ డగుచున్ వర్ణాశ్రమాచార సం
గ్రాహ్యాచార్యుం డయి యీ ప్రపంచ మఖిలం బాదిన్ సృజించెన్, సదా
ప్రాచీనత్వము భారతీప్రభృతి సంపాదించె శాస్త్రప్రథన్. ౨౧

ఉ. ఆతఁ డియిచ్చచే జనన మందె వసిష్ఠుఁడు సూర్యవంశసం
జాతులఁ జక్రవర్తులను శాసనవర్తులఁ జేయుచుం, బ్రదీ
ప్తాతత కీర్తియై వెలసెఁ, గేవల మాతఁ డయోధ్యనుండి సి
ద్ధ్యాతుఁ డనర్ప బ్రహ్మఋషి గాఁ గులశాస్త్రము లందఁ బడెన్. ౨౨

క. శక్తి యతని సుతుఁడు మహా
శక్తి ప్రద్యోతితుఁడు త్రిశంకుప్రభు నా
సక్తిని జండాలాకృతి
యుక్తుం గావించె ధర్మయోగపరక్తిన్. ౨౩

క. స్మృతికర్త పరాశరముని
యతని సుతుండై వెలింగె నవ్యోర్జితుఁడై
ధృతవిష్ణుతేజుఁ డతనికి
సుతమతి ద్వైపాయనుండు సుతుఁడై పుట్టెన్. ౨౪

పద్మపదుఁడు జగన్నాథపదగురుండు,
నైరి ద్వారక గురుఁడు హస్తామలకుఁడు. ౩౧

వ. అయ్యాచార్యవర్యులందు, సురేశ్వరులు, నైష్కర్మ్యసిద్ధి, తైత్తిరీయోపనిషద్భాష్యవార్తికము, బృహదారణ్యక భాష్యవార్తికము, దక్షిణామూర్తి స్తోత్రవార్తికము; పద్మపాదులు, శారీరకమీమాంసా భాష్య వ్యాఖ్యానస్వరూప పంచపాదిక, ఇత్యాది మహానిబంధంబులు రచించి, వైదికధర్మంబు లోకంబున సుప్రతిష్ఠితం బొనరించిరి. ౩౨

క. అందెల్ల యజుర్వేదా
మందానందాస్పదంబు మహిమమహాఢ్యం బ
స్పందం బధిపీఠం బై
చెందెను ఖ్యాతిగా సురేశచిహ్నిత మగుటన్. ౩౩

శా. విద్యారణ్యయతీశాభిధానసత్కుఁ డా పీఠం బధిష్ఠించి శ్రీ
విద్యాపూర్వకనామమౌ నగర దేవిం దుంగభద్రానదీ
ప్రోద్యత్తీరభువిం బ్రతిష్ఠ సలిపెన్; బుక్కేశు నాతండె శ్రీ
విద్యాశంకరుఁ డాభిషేచనకవిస్త్రిం జేసె సుప్రహృష్టుగా. ౩౪

శా. వేదార్థంబులు నాస్తికాపశదదుర్వ్యాప్తంబులన్ స్వప్రభా
శ్రీదివ్యాకృతిఁ గోలుపోక స్థిరమూర్తిం గల్పవిస్ఫూర్తి స
మ్మోదంబుం బచరింప భాష్యములు సంపూర్ణంబుగాఁ గూర్చెనే,
యాదీప్తిన్ శతవిస్తరంబు సలుపంగా సాధనీయంబులన్? ౩౫

మ. అకలంకస్థితిఁ గూర్చి సృష్టియుతమై యష్టాపదాంగంబులన్
సకలాశాపరివేష్టితంబగు మహాచక్రీయంబునై నేమమూ
ర్తికపాదాసిఁ బ్రతిష్ఠ సేసె నతఁడే శ్రీచక్రరాజంబుఁ, బా
యక లోకైకగురూత్తముల్ పరమహంసాచార్యు లర్చింపఁగా. ౩౬

తే. రాజగురుఁడు విద్యాపురరాజ్యతంత్ర
మూనియును శ్రీవిరూపాక్షమఠి వసించి
సుస్ఫుటం జేసి, శృంగేరి విడువవలెను;
శ్రీవిరూపాక్షమే తదధిశ్రీ వెలింగె. ౩౭

క. విధివశతఁ దల్లికోట
ప్రధనంబున రామరాజు పడి యడఁగుటచే
నధికార మడఁగి యడవుల
నధివాసము చేసి రెవ్వరో యతితతి గురువుల్. ౩౮

వ. ఆ జగద్గురుపరంపరయందుఁ గ్రమాగతులైన శాంకరశకంబున రెండు వేల మూఁడువందల మూఁడవదగు సంవత్సరంబున — ౩౯

క. ఉద్దండభారతీయతి
యుద్దండుఁడు పీఠ మెక్కి నెగ్గి జయశ్రీం
బుద్ధిశిత మొనరింపఁగ,
నద్దీపంబు శివగంగ నాత్మ లయించెన్. ౪౦

వ. అట్లు మచిలీపట్టణ సమీపంబున నుద్దండభారతీయతులు సిద్ధి నొందిన దాదిగ శ్రీశృంగేరి శ్రీవిరూపాక్ష శ్రీపీఠాధిపతులు కృష్ణా గోదావరీ విశాఖాది మండలంబులు తమ ముఖ్యస్థానంబులుగఁ జేసికొని, లోకసంగ్రహార్థంబు భారతీస్వామియం దెల్లఁ బరిపాలించు మన ధర్మ శాసకులై వెలుంగుచుండిరి. అందు, శ్రీ బోధానందభారతీయతులు పూర్వాశ్రమంబున విధివిధానంబున మహాగ్నిచయన పర్యంత క్రతువులు మహోన్నతవంబున నాచరించి, వారు నృసింహ మహాగ్నిచి న్నామమునఁ బ్రసిద్ధిం జెందిరి. ౪౧

క. హారితస గోత్రుం డతఁడు
వరలెను దైవజ్ఞ సార్వభౌమాదిక సత్
పరిషత్కృత బిరుదాళీ
పరిపూజ్యుఁడు సర్వతంత్రపరినిష్ఠితుఁడై. ౪౨

వ. ఆ మహాగ్నిచిదిందుఁడు సంన్యస్త సర్వకర్ముండై శ్రీ సచ్చిదానంద భారతీ యతీంద్ర కరకమల సంజాతుండై యవతరించి, ౪౩

క. వాసిగ బోధానందుఁడు
శాసించెం బరమహంససామ్రాజ్యపదం

గీర్వాణభాషయందు — కల్యాణశ్రీకల, శ్రీ లలితా రహస్యనామ స్తోత్ర శ్రుతి సీమంతంబునకు వైదికగ్రాహ్యాత్మక మహాభాష్యంబై తన రారు; బ్రహ్మకల, యుపాసనాసర్వస్వ మూర్తంబై యెసంగు; పూర్ణమీమాంస, పూర్ణస్వస్వరూపదర్శనంబై భాసిల్లు; సంజీవని, ఆపస్తంబీయ దర్శపౌర్ణమాస వ్యాఖ్యా సముజ్జీవకంబై శోభిల్లు; సంధ్యాకళ, సంధ్యావందన సూత్ర భాష్య ప్రఖ్యాపకంబు; తంత్ర శాస్త్రసుధ, సర్వతంత్రైకదీపంబై వెలుంగు; బ్రహ్మసూత్రసంజీవని, సువ్యాఖ్యానిష మూర్తిమత్ప్రాయంబగు బ్రహ్మసూత్రంబునకు సంజీవ నౌషధమై యొప్పు; కల్యాణసంహిత, సర్వాగ్నిజనానవశ్యాధ్యేతవ్య కృష్ణయజుస్సంహితాభాగ విహితంబై యలరారు; కల్యాణస్మృతి, ప్రాయశ్చిత్తసమున్నయము, శ్రీయాగసూత్రము, సర్వదేవతాప్రతిష్ఠా విధి, శ్రమానయయజ్ఞవిధి, మహారుద్రయాగప్రయోగము, సంన్యాస దీక్షావిధి, మున్నగునవి తత్తద్విషయ విధాయక ప్రమాణగ్రంథం బులు. అట్టి గ్రంథంబున, — కల్యాణసుధ, శారీరకమీమాంసా భాష్యంబునకు కవ్యావివరణరూపంబు; గీతామృతతరంగిణి, భగవద్గీ తార్థదర్పణంబు; వేదాంతమీమాంసాశాస్త్ర హృదయము, బ్రహ్మ సూత్రార్థసారంబును నై విలసిల్లు. ఇవ్వియుం గాక, శ్రీనగు లోక సంగ్రహార్థంబు రచించిన శ్రౌతస్మార్త ధర్మంబులు, ఉపాసనావిశేషం బులు, వేదవేదాంత రహస్యంబులు వివరించు గ్రంథ జాలం బసంఖ్యాకంబై యలరారు. ఇవ్విమాంసలు పూర్వాశ్రమ స్మరణంబు దురితా పహం బగు పండితోత్తముల వాక్యంబు కులగోత్రాదీనము లగు కౌలిక గుణములక నొప్పారుచునుగాక, యవి సరసించి, శ్రీవిద్యాశంకర భగవత్పాదులబ్రహ్మవిదులు అయిన నాచార్యశిఖామణులు నానుపూర్వ కంబుగా దజ్జన్మకథా స్మరణ విస్తరణంబులు లోకసమయంతాద్యధిక మహత్త్వంబులు సకలశిష్టజన పరిగృహీతమ్ములు యని సుజనావనం దెచ్చి, యిచ్చట కవిపుంగవుల పూర్వాశ్రమ గోత్రాన్వయనామాది కీర్త నమ్ము కావించవలసిన యున్నది, సంక్షిప్తరూపమ్మున సంస్మరింతు. ౨౦

తే. మున్ను తంజాపురీరాజభూమియందు,
బ్రాహ్మణాగ్రహారంబు వెలంగమాను
వెలయు; నందు నిత్యాగ్నులు వేదవిదులు
రాజిలిరి పదుమూఁడు గోత్రములవారు. ౫౧

క. ఆ రాజ్యపతియధర్మం
బోరువ కొకనాఁడు వార లొక్కుమ్మడిగా
నా రాజ్యము వీడి బయలు
దేరిరి కాశికిని బోవఁ దివిరినమతితోఁ. ౫౨

క. తమతమ యగ్నులు మాత్రమె
తమ సర్వస్వంబు గాఁగఁ దరలి నడచు వా
రమలం బగు గోదావరి
సముపాంతస్థలము విడిసి సాగిరి దారిన్. ౫౩

క. వారల కథ విని పెద్దా
పూరేలెడు రాజు, వేఁడి, పోనీయక, పే
రూ రగ్రహార మిచ్చి స
గౌరవముగ నిల్పె వారిఁ గడుఁ బ్రీతి నటన్. ౫౪

వ. తదాదిగాఁ దద్వంశంబులవా రాంధ్రధరప్రసూతులై పుత్రపౌత్రవిశేషంబులఁ బరివృద్ధులై పేరూరిద్రావిడులను నామంబునఁ బ్రసిద్ధులై, యశస్వులై, యాజకులై, వేదవేదాంగవిదులై, వెలయుచుందురు. అట్లు ఆంధ్ర భూమికి వలస వచ్చిన కుటుంబములు పెక్కులు గలవు. ౫౫

తే. వారిలోఁ బెదవజ్ఝలు భార్గవుఁడును
నైతహవ్య సావేతస ప్రఖ్యులైన
గోత్రఋషుల వాధూలస గోత్రుఁ డొప్పె
నన్నిటం బెద్ద యగ్రహారాగ్రణి యనఁగ. ౫౬

వ. ఆ పెదవజ్ఝలకు వేదాధ్యయనపరు లగు నేవురు పుత్త్రు లుదయిం
చిరి. అందు జ్యేష్ఠపుత్త్ర వంశములోనివాఁ డగు గంటి లక్ష్మన్న

శాస్త్రి, మహాపండితుఁ డగుట విజయనగర భూపాలుం డాతనికిఁ దన యాస్థాన పండితపదవి నొసంగి, గోప్తనీ సాగర సంగమప్రదేశంబునఁ గల సంగమవలస యను గ్రామము నెలవు గావించి, సమగ్రంబు లగు వసతుల నర్పించె. వారి వంశక్రమంబున వీరేశ్వరశాస్త్రి యుదయించి, భీమునిపట్టణంబున గృహంబులు నిర్మించె. ఆతని పుత్త్రుండు లక్ష్మణశాస్త్రి మహాపండితుఁ డయ్యెను. ఆతనికి బ్రహ్మముఖంబులం బోని నలువురు సుతు లుదయించిరి. అందు రెండవవాఁడగు వీరేశ్వరశాస్త్రి మేధావియై యొప్పుచుఁ, బరమసాధ్వి యగు జోగమ్మను బరిణయం బాడె. ఆ పవిత్రదంపతులకు కామేశ్వర దేవతాప్రసాదంబున నిరువురు పుత్త్రులు పుట్టిరి. అందు — ౨౮

క. సురవైద్యుఁ డవతరించిన
సరణిం బెదకాముఁ డఖిల సంస్తుతుఁ డయ్యెన్;
సురగురుఁ డన షడ్భాషలు
కఱచిన చినకాముఁ డొప్పెఁ గడుఁ బ్రాజ్ఞుండై. ౨౯

వ. మఱియు నా పేరూరి ద్రావిడవంశంబులందు నేక తాతాప్రసారంబు నివాసంబుగాఁ గలిగి, ౩౦

క. తాతావంశము వేదస
నాతన; మం దొప్పు సూర్యనారాయణ వి
ఖ్యాతానఘాసి; సోదెమ
నాతండు గ్రహించి మించె నాత్రేయసుఁడై. ౩౧

క. తాతా సుబ్బారాయం
డాతనికి ద్వితీయపుత్త్రుఁడై వెలసె; బుధుం
డాతండు విజయనగర
స్థిత మహారాజగురుఁడు విద్వద్ఘనుఁడున్. ౩౨

క. తాతా సుబ్బారాయని
కై తోఁబుట్టువుగఁ బార్వతమ్మ యొసఁగె నా

నాతిన్ గ్రహించె గుణ వి
ఖ్యాతుఁడు సతిగాఁగఁ జిన్నకామేశుఁ డొగిన్. ౬౨

తే. పార్వతీదేవి సింధుగర్భంబు దాల్చి
యరుణగర్భయౌ ప్రాచీదిగంగనవలె
సూర్యనారాయణాభిధానార్యునింట
నేకతాగ్రహారమం దెలిమి నుండ, ౬౩

క. వేదపదక్రమ పాఠని
నాదంబులు వినుచు సూర్యనారాయణుఁ డా
వేదముఖుం డుదయించును
నాదాపుత్రుఁడుగ నంచు నందించు మదిన్. ౬౪

తే. చిత్రభాను వైశాఖ పవిత్ర శుద్ధ
పక్షమున నష్టమిని జయవాసరమున
మిథున లగ్నంబునం బుష్యమీ ప్రయుక్త
తారఁ బార్వతి కనెఁ బుత్త్రు సూరిమిత్రున్. ౬౫

క. కేశుఁడు మేశుం డీశుం
డే శబ్దంబున వెలయుదు రేకపదంబై,
యాశబ్దము కామేశం
బా శిశువున కమరె సార్థకాహ్వయము మాగుచున్. ౬౬

క. కౌమారము యౌవనమును
గామేశుఁడు మాతులునకుఁ గడుఁ బ్రియుఁ డగుచున్
దా మని తాతాసుధికడ,
నేమంబునఁ జదువు లెల్ల నేర్చుచుఁ గడపెన్. ౬౭

శా. తాతారాయఁడు శాస్త్రి వ్యాకరణశాస్త్రప్రాజ్యసామ్రాజ్యుఁడై
సేతుశ్రీహిమశైలమధ్యమున వాసిం గాంచె నాచార్యతా
ఖ్యాతిం బ్రాప్తసమస్తవిద్యల ననన్యాత్మప్రభాధుర్యుఁడై
యాతం డొందె మహామహోపపద ధుర్యంబౌ నుపాధ్యాయతన్.

శా. తాతారాయఁడుశాస్త్రి గీ మఖిలవిద్యాపీఠమై మండన
స్ఫీతాస్థానము వోలె వెల్గ నచటన్ విద్యాంసులున్ ఛాత్ర వి
ఖ్యాతిన్ వ్యాకరణంబు న్యాయమును వేదాంతంబు మీమాంసయున్
శ్రౌతస్మార్తవిధానపాళి సరహస్యం బభ్యసింప్రేమ్మతిన్. ౧౯

సీ. పాతంజలము మహాభాష్యంబు నొక్కఁడ
జైమినీయ మ్మొక్క చక్కి వినును,
గౌతమీయన్యాయరీతి నొంటఁ గణాద
వైశేషికము నొక్క ప్రక్కఁ దెలియు,
సప్రయోగమ్ముగా శ్రౌతసూత్రము నొక్క
చాయను విను స్మృతిజాత మొకట,
భాష్యయుక్తంబుగా బ్రహ్మసూత్రంబులు
నుపనిషత్తులు గీత లొకట నేర్తురు,
ప్రాతిశాఖ్యల నొకవేళ శ్రవణ మొగ్గు,
శాస్త్రసాహిత్యగోష్ఠులు సలుపు నొకట,
నా మహామహోపాధ్యాయుఁ డైన సుబ్బ
రాయ నింటఁ గామేశుండు ప్రకటసిరిని. ౨౦

శా. ఆలించం గను శ్రద్ధ వేదములు శాస్త్రాలిం బఠచ్ఛాత్రులై,
పాలించున్ శ్రుతిసిద్ధసత్యవిధులన్ బ్రాహ్మ్యంబుకే, కాని, యే
వేళన్ దానఁ దప్పుల్పడండు, దగులున్ వేదాంతవాక్యంబులన్,
బాలప్రాయమునందె వాని కవి విస్పష్టంబులై యొప్పుటన్. ౨౧

కం. ఎల్ల బ్రాయంబున నతనిం
దలిదండ్రులు మఱి గృహస్థధర్మునిఁ జేయన్
లలిఁ బట్టించిరి కే లొక
యెలనాగన్ వేదవిదులయింటి దగు సతిన్. ౨౨

సీ. పరిణయమహోత్సవం బట్లు పరిఢవిల్లు
పట్ల నైదవనాఁడ యా వరునితల్లి

పార్వతీదేవి దేహంబు వదలి చనియె,
వచ్చె యాకస్మికమ్ముగా వ్యాధి యొండు. 23

ఉ. దీక్షితుఁడై వివాహవిధిఁ దీర్పఁగ నొప్పిన రూపు ...
దీక్ష కుపక్రమించె వినతిం బచరింపుచు నార్ధ్వదేహికం
బక్షయలోక మీ జనని, కాతనిఁ జూచిన గేస్తు ...
వీక్షణపంక్తి నశ్రువులు నిండఁగఁ గాటిచి రేకధారగా. 24

క. కామేశుని నెమ్మది నద
సీమంబున భవవిరక్తి నిష్ఠం బెంపన్,
గామినిఁ జూడఁడు లోలతఁ,
గామినులును శుకునినట్లు కాంచెద రతనిన్. 25

తే. దక్షిణాచారమార్గ మాంధ్రమున నొక్క-
రాణిచయనుల సంప్రదాయాన నెసఁగు
నని వినుట నమ్మహామహు నెనరు వడసి
పొందె మంత్రోపదేశ మమందవృత్తి. 26

మ. ఒకనాఁ డాతని కద్భుతంబుగ శ్రవ యోగంబునన్ మి...
నకలంకంబును రోదసీకుహరపర్యాప్తంబు జ్ఞానైకగా
పక మానందమయం బఖండమును విశ్వస్ఫూర్తిబీజం ...
నొక నాదం; బది తన్నుఁ బిల్చె ప్రణవధ్వానాళిగా నెం...

మ. ఎద నేదో మధురార్ద్రతాపశిఖ బాధింపంగ దాహాకుచున్
మది యెప్పాటను శాంతి నొందమి నకస్మాజ్జాతహా సూహా ...
య్యదియే దీనికి నౌషధం బనుచు బోధానందహాసేంద్రుమున్
వెదుకంగాఁ జని యెట్టకేని దరిసించెన్వారి నమ్మాపురిన్. 28

వ. అచ్చట బాలకామేశ్వరశర్మ పండిత పరిషదనుజ్ఞాతుఁ బ్రసంగ ప్ర...
శుద్ధచతుర్దశీ గురువాసరమ్మున యథాశాస్త్రీయమ్ముగాఁ దుకీ...
శ్రమ స్వీకారం బొనర్చి, జగద్గురు శ్రీ బోధానందభారతీ యతీంద్రుల
యనుగ్రహంబున మహోపదేశంబు నొంది కల్యాణానందభారతి యను

నక్షత్రనామంబున ద్వితీయ జన్మంబు నొంది, పిమ్మట రుధిరోద్గారి సం॥ మార్గశీర్ష పూర్ణిమా భానువాసరమ్మున జగద్గురుపదవి నభిషిక్తులైరి.

### వ్యాఖ్యాన సింహాసన వర్ణనము

సీ. బ్రహ్మవర్చస్స్ఫూర్తి వరలుమూర్తిం గన
  నగ్ని దేవుం డితం డనఁగఁ దోఁచుఁ,
గాంతిపుంజం బైన కాషాయంబు గాంచిన
  బాలసూర్యప్రౌఢిఁ బరిఢవించుఁ,
చిఱునవ్వు వెన్నెలల్ గురియు మోమును జూడఁ
  బూర్ణచంద్రుం డను బుద్ధి వొడము,
బహుముఖప్రస్ఫుర త్ప్రవచనంబులఁ గాంచ
  భారతీశుం డను భావ మొదవుఁ,
ప్రబలధర్మేతరములఁ గోపంబు చూడ
సితఁడు భార్గవరాముఁ డన్పించుఁ బ్రజకు,
బాల కల్యాణమూర్తి పూజ్య పాదగురులు
పరమహంస సామ్రాజ్యాధిపదము దాల్ప. ౮౦

వ. శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య పదవాక్యప్రమాణ పారావారపారీణ యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణా ధ్యాన సమాధ్యష్టాంగ యోగనిష్ఠా గరిష్ఠ తపశ్చక్రవర్త్యనాద్యవిచ్ఛిన్న గురుపరంపరాప్రాప్త సాంప్రదాయిక షడ్దర్శనాచార్య వ్యాఖ్యాన సింహాసనాధీశ్వర సకలవేదార్థ ప్రకాశక సాంఖ్యత్రయీ ప్రతిపాదక సకల నిగమాగమ సార హృదయ వైదికమార్గ ప్రవర్తక సర్వతంత్ర స్వతంత్ర విద్యానగరాది మహారాజధానీ కర్ణాటక సింహాసన ప్రతిష్ఠాపనాచార్య తుంగభద్రాతీరవాస ఋష్యశృంగ పుర వరాధీశ్వర శ్రీ విరూపాక్షాధీశ్వర శ్రీమ దాచార్యాన్వయ పరివృఢ శ్రీమ ద్రాజాధిరాజ మహారాజ గురు భూమండలాచార్యా స్యన్వర్థ సకలబిరుదావలీ విరాజమాన శ్రీవిద్యాశంకర పదమావేశ ప్రకాశిత శృంగగిరి శ్రీవిరూపాక్ష శ్రీపీఠాధీశ్వర భారతీ సంప్రదాయ

సార్వభౌమ జగద్గురు శ్రీ బోధానందభారతీ మాంతాచార్య మహా
స్వామి కరకమలసంజాత జగద్గురు శ్రీ కల్యాణానందభారతీ మహాంతా
చార్య మహాస్వామి చరణములు, వ్యాఖ్యాన సింహాసనాధిష్ఠితులై
యొసఁగుతజే, ౮

ఉ. బాలార్క ప్రభామాన తేజుఁడు శ్రుతిప్రఖ్యాత దివ్యాగ్రలీ
లా లోలాత్మముఖుండు నిత్యరసనా లాస్యస్థసద్భారతీ
కేలీ మంగళ విగ్రహుం డతఁడు పంకేజాత గర్భుండు తా
నై లోకంబు సముద్ధరింప దిగి కొల్చెనట్లు భాసిల్లెడిన్. ౯

చ. సనకసనందనాది మునిచంద్రులు మీరు, వసిష్ఠుఁ డితఁడే
మునిమణి నారదుం డనుచుఁ బూజ్యతఁ గొల్చుచుఁ దక్షిణంబు న
ధనులు తురీయధర్ములు సతంబు గురూత్తముఁ గొల్చుచుందు రా
ఘనుకరకంజజాత శుభగాత్రులు మానసమాత్ర సంభవుల్. ౧౦

మ. ఎదలం బెచ్చినభక్తి కౌతుకధృతిన్ హెచ్చింప శ్రౌతాస్వాదముల్
వదలంబోవక సూర్యునిలో వెలుఁగు దివ్యజ్యోతి సర్వాంతమున్
బదిలంబుగ భావించి కాంచుచును విశ్వవ్యాప్తిఁ దద్వ్యాప్తిఁ ద
త్పద మేవేళ సమాశ్రయింత్రు త్రిపురాతత్త్వజ్ఞయోగేశ్వరుల్. ౧౧

సీ. లక్ష్మ్యం డొకండును రాముం డొకండును
విమలుం డొకండు శ్రీవిద్య యొకఁడు
వేద మొక్కండును విరజుం డొకండును
సత్యుం డొకండును నిత్యుఁ డొకఁడు
నొకఁడు విమర్శుండు నొకఁడు విజ్ఞానియు
విజయుం డొకండును వినయుఁ డొకఁడు
పూర్ణుండు బ్రహ్మంబు బోధుండు నమలుండు
నచలుండు జయుఁడు నారాయణుండు
సర్వేశ్వర ప్రకాశుండు శివుండు శంకరుండు
పరుఁడును సుశీలుఁడును యోగివరులు సతముఁ
గొలుచుచుందు రానందనాథులు తదీయ
శిష్యులై పాదుకాంతదీక్షితులు భక్తి. ౧౨

తే. మఱియు మహిమాఢ్యు లున్నారు మహితయశులు
యోగివర్యులు కల్యాణ యోజితాత్మ
సాధుకాంత దీక్షాచార్యపదులు పంక్తి
పావనులు లోకపావన భవ్యతనులు. ౮౧

సీ. క్రమ జటా ఘనల సాంగముగ శ్రావ్యంబుగా
నర్చించు సూర్యనారాయణుండు,
వేదాంతగోష్ఠి వినోదంబు పచరించు
సుధి యల్లలింగన సోమయాజి,
చర్చించు దైవజ్ఞ సార్వభౌముఁడు దివ్య
గమనముల్ వేంకట రమణశాస్త్రి,
పాణిని వరరుచి పాతంజలప్రౌఢి
కలయఁ బేర్చును నీలకంఠసూరి,
సరస సాహిత్య సంపద సంతరించు
శ్రీయశశ్శాలి మాధవరాయశర్మ,
శ్రీ జగద్గురు కల్యాణ రాజ పూజ్య
యతుల యాస్థాన పుణ్య సభాంతరముల. ౮౨

సీ. పదముల సాహితీసమితి సభాపతి
సత్కవీంద్రుఁడు శివశంకరుండు,
కవికుటీరావాస కావ్యమర్మజ్ఞుండు
ప్రౌఢకావ్యుఁడు వీరరాఘవుండు,
కవితావతంసుండు గట్టి నృసింహుండు
రామసంజీవన కావ్య కర్త,
జ్ఞానవాసిష్ఠ నిర్మాణదక్షుఁడు సూక్ష్మ
బుద్ధి శ్రీరామ సద్బ్రహ్మయుండు,
కవి విధేయుఁడు గురుకటాక్షప్రసార
సార హృదయాబ్జుఁడీ నోరి నారసింహుఁ,
డా మహాస్థాన మెవ్వేళ నాశ్రయించి
కవిత వెలయింతు రిష్ట సత్కవులఁ గూడి. ౮౩

సీ. జ్యేష్ఠుండు శిష్యుల శ్రేష్ఠుండు యోగుల
లక్ష్యుండు లక్ష్మీనారాయణుండు,
అపరిగ్రహీత సర్వాగమవిదుఁడు వి
రజుఁడు చిద్వర్తి శ్రీరామమూర్తి,
ఘనవేదపాఠి వేంకట సోమపీఠియుఁ,
క్రమపాఠి విమలసూరావధాని,
శుక్లయజుర్వేద సూరి యాచార్యుండు
పురుషోత్తమావధాని పూర్ణయోగి,
పరమ సత్యార్థమూర్తుండు సాంబశివశాస్త్రి,
యమల పూర్ణాత్ముఁ డాదినారాయణుండు,
సుబ్బరాయుండు సౌశీల్య శుద్ధబుద్ధి,
కొలిచియుందురు కల్యాణగురుల సతము.

వ. ఇట్లు ధర్మసంపన్నంబగు మహామహిమనొప్పారు నప్పూజ్యపాదు[illegible]

సీ. వ్రాయుచు నొకవేళఁ బ్రస్థానములకు నూఁడు
భాష్యతద్వ్యాఖ్యప్రబంధయుక్తి,
వివరించు నొకవేళ వేదవాక్యార్థముల్
కల్పోక్త మాధవోక్త క్రమమునఁ,
[illegible]ంచు నొకవేళ శ్రౌతప్రయోగ ర
హస్యంబు [illegible]తరార్థ్యస్పష్టశోభ,
[illegible] నొకవేళ నిగమాగమాచార
[illegible]క్రమము ధర్మనిష్ఠఁ దెగుచు,
స్వరచరణంబులా సమచితమూర్తిప్రతిష్ఠ
[illegible] నొక్క నొక్కవేళ,
భువనగురుఁడు శ్రీ కల్యాణ పూజ్య పాద
పరమహంసుఁడు భారతీవంశవిభుఁడు.

[illegible]ద్వైతధ్వాంత ప్రచండభాస్కర పదప్రఖ్యాతి దీపింప, న
[illegible]ద్వైతద్వేషులు దుర్వాదరణయాత్రల్ సల్ప వారింపఁడే,

తే. మేము వైయాకరణసార్వభౌమబిరుద
సహితుఁగాఁ బాత రాముఁడుశాస్త్రిఁ దొలుత,
మరల దైవజ్ఞసార్వభౌమపదమహితుఁ
జలిపితిమి వేంకటరమణశాస్త్రి నిట్లు. ౯౮

తే. ఇట్టిఁ డగుఁ బాత్రుఁడు కవిసమ్రాట్టు నాఁగ
మా యొనర్చెడినామముల్ మాన్యము లగు,
నవి యొసఁగుఁ ద్రిలోకి నన్వర్థసంజ్ఞ,
నిదియు నీసభ యంగీకరించుఁగాక. ౯౯

ఉ. పేరుగలాఁడు సత్కవులు పేర్చెడి సర్వసభాంతరంబులం
దీరు సభాపతిత్వపద సుస్థితుఁ డీ శివశంకరుం డిదే
తీరెన యాభిషేచనకదీక్షఁ గనుంగొనెఁ గాన నాతఁ డీ
నోరి నృసింహశాస్త్రి శుభనూతననామము చాటి చెప్పెడున్. ౧౦౦

వ. అని యానతిచ్చిన, సభాపతి శివశంకరుండు శ్రీ జగద్గురువుల యాదే
శంబు సభ్యులం దఱకును బరమసమ్మతంబుగా లేచి, నోరి నరసింహ
శాస్త్రి కవిసమ్రాట్టని ముమ్మాఱు సభామధ్యంబున నుద్ఘోషింప,

మ. కరుణాపాంగవిలోకనామృతముతోఁ గల్యంబుగా నంత శ్రీ
గురువర్యుల్ సకలాంగసేచనము నాకుం జేయుచున్ నాపయిన్
బరమాశాటి నొకండు కప్పి, "కవిసమ్రాట్సిద్ధనామస్న చిరం
పరివర్ధస్వ" యటంచు శీర్షముపయిన్ స్వర్ణాక్షతల్ వైచినన్. ౧౦౨

తే. మొరసె భూసురాశీర్వాదముఖరరవము
తోనెనసి కవిమిత్ర సంతోషరవము,
సభ సముత్పన్నమై జయజయరవంబు
ప్రతిరవ మ్మానె దశదిశావరణములను. ౧౦౩

ఉ. ఆ పరిషత్సమక్షమున నంత జగద్గురుపూజ్యపాద సు
శ్రీపదపంకజార్పణము సేయుచు భక్తిని కంత మెత్తి యీ
శ్రీపర దేవి భాగవత సిద్ధపురాణము వించితిన్ శిరం
బూఁప సదస్యు లెల్లరు నమూర్జితజన్మము సార్థకంబుగా. ౧౦౪

వ. మఱియును శ్రీసదనంబున శ్రీగురుదేవప్రతిష్ఠిత శ్రీమహాకామేశ్వర్యంబా రాజరాజేశ్వరీ ప్రతాపభారతీ పరాభట్టారికా పరదేవ్యాయతనముఖమంటపంబున నఖిల చాతుర్వర్ణ్య శిష్యబృందంబులుఁ జూడఁ శ్రీ సదాశివానందభారతీ యతీంద్రుల శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీ పీఠాధీశ్వరపదవి నధిష్ఠింపఁజేయ నుద్యుక్తులై వారలకుఁ బరమహంస సామ్రాజ్యాభిషేచనంబు నిర్వర్తింపఁబోవు సమయంబున, వ్యయ సంవత్సరాశ్వయుజ పూర్ణిమా గురువాసరమ్మున మిథునలగ్నమ్మున నన్ను శ్రీగురుదేవులు మరల రావించి, యందుఁ గొలువున్న శ్రీ రాజరాజేశ్వరీ పరదేవతా సమక్షంబున నుభయ జగద్గురువుల సన్నిధానంబున శ్రీ సత్యానందయతీంద్రులును బరివేష్టిత సకల కవి విద్వద్యోగివరేణ్యులును నాలింప నస్మత్కృత శ్రీదేవీభాగవతకథార్థంబు కొంత వినిపింపం బంచిన, నట్లొనర్చి కృతార్థుఁడనై వందనం బాచరించిన నాకుఁ దత్సభాముఖంబున నాశీరక్షతప్రక్షేపణ పురస్సరంబుగఁ గవిసమ్రాట్పట్ట శ్రీముఖపత్రంబు ప్రసాదించి యనుగ్రహించిరి. తదాదియు నేనును, ౧౦౫

ఉ. ఆ పరదేవికోమలకటాక్షము పాఱెన దీవిధంబుగా
నాపయి, దానియిచ్చకు గుణం బది యోటికి లెస్స, గాని నే
నీపయి నెట్టు లీసరణినే సిరిచూడ్కికిఁ బాత్రభూమినై
యోపుదునో చరింప, నని, యుందు నితాంతతదాత్మబుద్ధినై. ౧౦౬

చ. కోరను దీన్నికై ధనము, కోరను సద్యశమైనఁగాని, నేఁ
గోరను గౌరవాంకములు, కోరను సత్పదజన్మభాగ్యముల్,
కోరను జన్మమోక్షణము, కోరుదు నొక్కటె సుస్థిరంబులై
శ్రీరమణీయపాద సరసీరుహముల్ విలసిల్లుటన్ మదిన్. ౧౦౭

## కృతికర్తృ వంశ వర్ణనము

వ. హారితాంబరీష యౌవనాశ్వ త్రయాన్వయం బగు హారితగోత్రంబున నాపస్తంబసూత్రులు యజుశ్శాఖాధ్యాయులును వైదికనిష్ఠాభాసు

రులు నగు భూసురులం దాంధ్రదేశంబునఁ బొలుపొందు వెలనాటి సమాజమందు, ౧౦౮

తే. శ్రీగిరీంద్రంబు మొదలు నార్ష్టియునుదాఁక
వృషభశైలాది సింహాద్రివిస్తృతమహి
యజ్వలై కవులై పండితాగ్ర్యు లగుచు
నోరు గలవారు సిరి మీఱు నోరివారు. ౧౦౯

వ. అందు, ౧౧౦

తే. వేదనాదంబుతోడ నభిన్నవృత్తి
శ్రావ్యసంగీతనాదంబు సంతరించు
నతఁడు బ్రాహ్మణోత్తమాయనాదు వెలసి
మాన్యుఁడై పేరు గనె హనూమద్బుధుండు. ౧౧౧

క. అతనికి వేంకమ సాధ్వికి
సుతుఁడై గోపాలకృష్ణసూరి వెలసె స
న్నుతుఁడై యమోఘవాక్కృతి
వితతప్రథ మంత్రమర్మవిదుఁ డని బుధులన్. ౧౧౨

వ. ఆ గోపాలకృష్ణునకు రంభమనశోయను దిద్దరు పుత్త్రికలును, నలువురు పుత్త్రులును గల్గిరి. ఆపుత్త్రులలో జ్యేష్ఠుం డగు నాగేశ్వరరాయుండు వంశకరులగు పుత్త్రులం గాంచె. ద్వితీయుం డగు రాజేశ్వరరాయుండు కవియై బహుకావ్యంబులు సంతరించి యశోమాత్రపుత్త్రుం డై గతించె. మూఁడవకుమారుం డగు హనూమద్బుధుండు మహాపత్ప్రవాదుండు వేద విద్యాసనాథం బగు కౌండిన్యగోత్రంబున వేలివంశంబున నుండి, క్రమాంతస్వాధ్యాయపరుండును సగ్న్యాధానదీక్షితుండును పరమ వైదికధర్మనిష్ఠాభాసురుండును నగు నాగలింగదీక్షితుల ద్వితీయ పుత్త్రిని మహాలక్ష్మిని వివాహము చూడి, నలువురు పుత్త్రుల నొక్క పుత్త్రికను గాంచె. గోపాలకృష్ణుని కనిష్ఠపుత్త్రుండగు గురులింగశాస్త్రి చెన్నపురంబునఁ బండితపదవి సుప్రతిష్ఠితుండై, ౧౧౩

సీ. భారతం బాదిగా బహుపురాణంబులు
రచియించెఁ దెలుఁగున వచనశైలి,
ధర్మశాస్త్రాళికిఁ దత్సూత్రవిస్తర
వ్యాఖ్యానములు కూర్చె నాంధ్రభాష,
జైమినీయాదిక జ్యౌతిషగ్రంథార్థ
కలన నిరూపించెఁ దెలుఁగువాణి,
గీతారహస్యార్థ జాతప్రకాశాది
వేదాంతకోశముల్ వెలయఁ జేసె,

వేయు నేటికి విజ్ఞాన భిక్ష నేఁడు
యాంధ్రబాలికిఁ బెట్టిన దాఁడ కాదె,
శాస్త్ర వేదాంత హోరాది శాస్త్రవిదుఁడు
నేటి గురులింగబుధుఁడు విస్తారయశుఁడు. ౧౧౪

క. అస్మత్పితృపాదుం డగు హనుమద్బుధుండు, ౧౧౫

ఆ. సంస్కృతాంధ్ర సాహిత్య వారంనిధుండు,
శ్రీమహాపాదుకాంత దీక్షా మహాత్ముఁడు,
జనకుఁడు మదీయ సవితృదీక్షాగురుండు,
విదిత పండితకవి సాంకవిత్వగురుఁడు. ౧౧౬

గీ. శ్రీమాతయమ [illegible]
[illegible],
[illegible]
[illegible]. ౧౧౭

వ. వారికి రాజగోపాలశాస్త్రియు, సీతారామశాస్త్రియు, వేంకటలక్ష్మీనరసింహశాస్త్రియు, చంద్రశేఖరశాస్త్రియు నను నలువురు పుత్త్రులును, రాజ్యలక్ష్మి యను పుత్త్రికయుం గలిగిరి. అందుఁ దృతీయపుత్త్రుండ నగు నేను కౌండిన్యసగోత్రుం డగు నేతి శ్రీరామశర్మ పుత్త్రి మల్లిప్రసూనామ్ని ధర్మపత్నిగాఁ బరిగ్రహించి సకుటుంబంబుగా శ్రీ జగద్గురుకరుణా కటాక్షపాత్రుండనై వర్ధిలుచుందు. ౧౧౮

క. కల్యాణాస్పదచరణా!
కల్యాణైకస్వరూప! కల్యాణగుణా!
కల్యాణప్రద! భారతి!
కల్యాణానందనామ! ఘనయతిసోమా! ౧౧౯

క. సాక్షా ద్వ్యాసుఁడ వంచును,
సాక్షాత్పరదేవి వంచు, సత్కవి వంచున్,
వీక్షించి, సమర్పించితి,
నక్షయ్యకటాక్ష మిందు నమరింపఁగదే! ౧౨౦

క. ప్రజ్ఞాన ఘన కథాద్యుతి
నజ్ఞానధ్వాంత పరమహంసార్చిత మీ
విజ్ఞానయోగి కృష్ణో
పజ్ఞము తనప్రజ్ఞ నిట్లు ప్రతిదీపించున్. ౧౨౧

తే. అవధరింపు, భవత్పూజ్య హస్త పంక
జాభిషేచన సామ్రాజ్య శోభితుండు,
దివ్యమగు విద్య విజ్ఞానదీక్షితుండు,
పట్టికాశ్రీకుఁడు కవిసమ్రాట్టు, పలుకు. ౧౨౨

శౌనక ప్రశ్న

తే. పుణ్యమై యొప్పు నైమిశారణ్యభూమి
శౌనకాదులు కలిభీతి సంశ్రయించి;
రందుఁ బౌరాణికోత్తముఁ డయిన సూతుఁ
గాంచి శౌనకమౌని భాషించె నిట్లు. ౧౨౩

శా. సూతా! ధన్యుఁడ వయ్య! శుష్కులఁ గదున్ శుద్ధుండ వీవే; పరి
జ్ఞాతం బయ్యెఁ బురాణసంహిత సమస్తంబున్ సమర్థంబు నీ
చేతన్ వ్యాసమునీంద్రుకూరిమి; భవచ్చిత్తంబు తాపత్రయా
పేతంబౌతఁ; జిరాయు రున్నతి యశస్స్వీకృతుండవై వెల్గుమా. ౧౨౪

తే. మునుల విశ్రామదేశ మీ పుణ్యవనము
విశ్వసనవామకం బయి వెలయు నిందు
గూడిన మునీంద్రసమితికి వేడుకయ్యె
బ్రహ్మసమ్మిత దివ్యపురాణము విన. ౧౨౫

తే. షడ్రసోపేత రుచిరాన్న సన్నికర్ష
జిహ్వ కాహ్లాద మెట్లు సిద్ధ మట్లు
బుద్ధిమంతుల వాక్సుధాపూరములను
శ్రోత్ర మానందకందళ చుంబిత మగు. ౧౨౬

తే. చెవులు లేనట్టి చిలువలే యవశము లయి
యాడును మనోహరధ్వని కనుగుణముగఁ;
చెవులు కల్గియు వా రయ్యొ! చెవిటివారె,
విధిహతులు సత్కథావళి వినని నరులు! ౧౨౭

మ. కలికిన్ భీతిలి యీ పవిత్రతమమహా కాంతారమధ్యమ్మునన్
కలి వర్జ్యం బని చేరి, పాసి కలఁకం; గాలంబు వెళ్లింప, ని
చ్చలు శాస్త్రార్థములం బురాణకథలన్ జన్మంబులన్ సత్రదీ
క్షల నా సత్యయుగప్రతీక్ష నిటు వాసం బుంటి మో పుణ్యులా! ౧౨౮

క. వేదాంతము సాత్త్విక మగు,
నాదట మీమాంస రాజసాత్మకము నగున్,
వాదవితండము న్యాయం,
బాదిం ద్యాజ్యంబు తామసాత్మక మగుటన్. ౧౨౯

క. ఏచాయ శాస్త్రరీతులొ,
యాచాయఁ బురాణచయము నగుఁ ద్రిగుణంబై;
వాచంయమీంద్రు లిందున్
యోచింతురు శుద్ధసాత్త్వికాఖ్యానంబున్. ౧౩౦

ఉ. ఏది స్మరింపఁ గామదుఘ, మేది వినన్ సకలార్థ సిద్ధిదం,
బేది పఠింప ధర్మకర, మేది విచింతన సేయ ముక్తిసం

పాదక మహా ముముక్షులకుఁ భవ్యము దివ్యము వేదసమ్మితం
బేది పరాత్పరం, బది వచింపుము భాగవతాఖ్యసంహితన్. ॥౩౯॥

తే. యజ్ఞశతము లొనర్చి నే మలసినాము;
శాంతి నొందము కేవల స్వర్గవాంఛ;
నమృత మేల పునర్జన్మ మగునదేసి!
జ్ఞానమే వినా మోక్షసిద్ధాన మున్నె! ॥౪౦॥

క. కావున నే మర్థింతుము
పావనము రసైకఘుటిక పరమరహస్యం
బావలఁ జేర్చెడుతరి శ్రీ
దేవీభాగవతకథను దెలుపఁగ సూతా! ॥౪౧॥

## కథాప్రారంభము

క. ధన్యోస్మి యనుచు సూతుఁడు
మున్యాదేశంబు వించు, మూర్ధాంజలిబం
ధన్యాసమ్మునఁ దగి, స
మాన్యమ్ము లగు పలుకు లిట్లు మాలిమిఁ బలికెన్. ॥౪౨॥

క. అహహా నా సౌభాగ్యము!
మోహాళి విదల్చి ముక్తి మునుకొను దేవీ
మాహాత్మ్యసత్కథావళి
వ్యాహరింపంగ మీర లాజ్ఞాపింపన్. ॥౪౩॥

తే. వ్యాసఋషి తదుపజ్ఞమహా భాగవతము
నం దధిష్ఠాత్రియై పొల్చు నాదిలక్ష్మి,
దీపశిఖవోలె మూఁడు వర్తికలమెలిసి
యేకమై వెల్గు నార్ద్రమై యెడఁద ప్రమిద. ॥౪౪॥

తే. అఖిలశాస్త్రంబులందు గుహ్యాతిగుహ్య,
ముత్తమాగమములలో ననుత్తమంబు

వేదవిదితంబు శ్రుత్యర్థవిహితపదము
నా పురాణంబు ప్రవచింతు ననఘులార! ౧౩౭

క. లలితముఁ దత్పదకంజముఁ
గొలుతుర్, యోగులకు ముక్తిఁ గూరిచి, బ్రహ్మా
దులకున్ సేవ్యం బై, మా
నులకున్ ధ్యేయైకపదము, నుతసత్పథమున్. ౧౩౮

మ. వేదములందు విద్య యని విశ్రుత మెయ్యది, యాద్యశక్తి యా
నేది, పరాభిదం బెఱుక యేది, విదిర్చఁగ బంధముల్ క్రమం
బేది, దురాత్మదుర్విషయ మేయది, మానికి ధ్యానగమ్య మా
నేది, యదే మదిన్ నిలిచి నృత్యము సేయుత మాయితంబుగా.

శా. చిదచిద్వ్యాపక మా జగత్త్రిఖిలమున్ సృష్టించి పాలించుచుం,
దుది సంహారము చేయు మూర్తిఁగులై తోల్కాడు శక్తిత్రయిన్
ఉద నైనన్ రమియించు నొక్కతయె యాత్మానందయై దాని నె
మ్మని ధ్యానించెద విశ్వసూతి నపరన్ మన్మాత నాత్మాత్మికన్.

ఆ. ఈ సమస్తంబు బ్రహ్మ సృజించె నంచుఁ
బ్రథిత మాను పౌరాణికవచనసరణి;
బ్రహ్మ జనియించె హరినాభిపద్మమందు;
నన, స్వతంత్రుఁ డను వచింప నగు నె వాని? ౧౪౧

ఆ. ప్రళయకాలంబునఁ బయోధిజలములందు
శేషుని సహస్రఫణాశయ్యఁ జేర్చి మేను
మఱచి కనుమోడ్చి నిద్రించు మాధవుండు,
నస్వతంత్రుఁడ; భగవంతుఁ డగుట యెట్లు? ౧౪౨

ఆ. అచ్యుతాధార మైన యేకార్ణవమును
బ్రభు వనఁగ రా దపాత్రమై రసము లేమి,
భూత సర్వస్వమున శక్తిభూత యెవ తె,
శరణు చొచ్చెద నే దాని సర్వజనని. ౧౪౩

క. అజుఁ డంబుజస్థితుం డయి
నిజజనకుం గాంచి యోగనిద్రావశుఁగా,
భజియించె నెట్టి దేవిని,
భజ రే మన, యట్టి దేవి, భక్తశరణ్యన్. ౧౪౪

క. దానిని మాయన్ సగుణన్
దానినె నిర్గుణను ముక్తిదాత్రిని మదిలో
ధ్యానించి చెప్పఁ దొడఁగితి,
మానులు వినుఁడీ పురాణమాణిక్యంబున్. ౧౪౫

పురాణప్రశంస

వ. అయ్యాదియు శ్రీమద్భాగవతాభిధానంబునఁ బరమపుణ్యంబై, పదు నెనిమిదివేలు శ్లోకములు గలుగ, ద్వాదశస్కంధ సమ్మితంబై, మున్నూట పదునెనిమిది యధ్యాయంబులతో నొప్పు. అందుఁ బ్రథమస్కంధంబున నిరువదియు, ద్వితీయంబునఁ బండ్రెండును, తృతీయంబున ముప్పదియుఁ, జతుర్థంబున నిరువదియైదును, నైదవ స్కంధంబున ముప్పదియైదును, షష్ఠంబున ముప్పదియొక్కటియు, సప్తమంబున నలువదియు, నెనిమిదవ స్కంధంబున నిరువదినాల్గును, నవమంబున నేఁబదియు, దశమంబునఁ బదుమూఁడును, నేకాదశంబున నిరువదినాల్గును, ద్వాదశస్కంధంబునఁ బదునాలుగధ్యాయంబులును విలసిల్లు. మఱియు, శ్రీదేవీమహాపురాణంబు ప్రతిస్కంధ రసబంధు రంబై, ముముక్షుజన ప్రియంబై, యష్టాదశసాహస్రి సంహిత నాఁ బరగు. ౧౪౬

తే. సర్గ మనఁగను మఱి ప్రతిసర్గ మనఁగ
వంశ వంశానుచరిత మన్వంతరములఁ
బంచలక్షణ యుక్తమై పరగు చుండు
నార్షకృతులు పురాణవిఖ్యాతి నెసఁగు. ౧౪౭

తే. సత్యముగ నిర్గుణము బ్రహ్మ నిత్య మయ్యు
యోగిగణములఁ గృపఁ బ్రో సముద్ధరింప
వికృతియై వ్యాపకాకృతి వెలయును శివ
యద్యాది చరాచరాధార యగు తురీయ. ౧౮౮

సీ. దాన శక్తులు మూఁడు తన్వి తనువు లూను,
సదు మహాలక్ష్మి స్వచ్ఛసత్త్వ,
రాజసాత్మ మహాసరస్వతి యౌ, మహా
కాళిక తామసాకార యగును;
ఈ మూఁడు శక్తులు సృష్ట్యర్థమై దేహ
సంగతి నొందుట సర్గ మండ్రు;
సృష్టి స్థితి వినాశ దృష్టిమై విష్ణు హర
శంకరజని ప్రతిసర్గ మండ్రు;

వంశ మగుఁ జంద్ర సూర్యాది వంశ్య గణన,
మఖిల మనుకాల గణన మన్వంతర మగు,
వారి వంశానుచరితమౌ వంశగణన;
పంచలక్షణ మీరీతి భాగవతము. ౧౮౯

తే. ఇట్లు పల్కిన సూతు వీక్షించి పల్కె
శౌనకుఁడు మౌనిసమితికి సమ్మతముగ,
స్మృతిపథమ్మునఁ దమ పూర్వవృత్త మూడ,
మఱియు నెఱుఁగఁ బురాణసమస్తమహిమ. ౧౯౦

ఉ. నేము కలిప్రవేశమున నేమరభీతి నజున్ భజింపఁగా
నా మునిపూజ్యుఁ డొక్క మహిమాన్వితచక్రము నిచ్చి, చక్రపు
న్నేమి విశీర్ణ మౌ నెచట నిల్చుఁ, దటన్ కలిబాధ లే దనెన్,
నైమిశ మయ్యె నేమి యిట నాశము నొందుట బ్రహ్మవాక్కులన్.

ఉ. ఏము తదాది నీయెడ మునీంద్రులు సిద్ధులు నాశ్రయించి యు
న్నా మిట నేకచిత్తుల మనామయ మీ రుచిరాశ్రమంబు, సూ

తా! మహనీయచిత్త! కడు ధన్యుల మైతిమి నీదు రాకచే;
నామము లేవి తెల్పుము, విన౯ మన సయ్యెఁ బురాణజన్మముల్.

తే. వితత సుగుణైకపాత్రమై యతి పవిత్ర
మఖిల జగదంబికానాట్య మటు విచిత్ర,
మఘకదంబంబు హరియించు నర్థకంద,
మది వచింపుము వ్యాసోక్త మంబిక కథ. ౧౫౩

వ. అన విని సూతుం డి ట్లనియె. ౧౫౪

తే. భద్వయము, మద్వయంబును, బ్రత్రయంబు,
వల చతుష్క, మనాపకూర్మ్యాలయు నాల్గు,
స్కాది యొక్కటి, లింగాదు లగును రెండు,
[illegible]యుఁ డష్టాదశపురాణము లివి యనుచు. ౧౫౫

వ. అందు, మాత్స్యంబు పదునాలుగు వేలును, మార్కండేయంబు తొమ్మిది వేలును, భవిష్యంబు పదునాలుగు వేల యైదువందలును, శ్రీమద్భాగవతంబు పదునెనిమిది వేలును, బ్రాహ్మంబు పదివేలును, బ్రహ్మాండంబు పండ్రెండు వేలును, బ్రహ్మవైవర్తంబు పదునెనిమిది వేలును, వామనంబు పదివేలును, వాయువ్యం బిరువదినాలుగు వేల యాఱునూఱులును, వైష్ణవం బిరువదిమూఁడు వేలును, వారాహం బిరువదినాలుగు వేలును, అగ్నిపురాణంబు పదునాఱు వేలును, నారదం బిరువదియైదు వేలును, పాద్మం బేఁబదియైదు వేలును, లైంగంబు పదునొకండు వేలును, గారుడంబు పందొమ్మిది వేలును, కూర్మంబు పదునేడు వేలును, స్కాందం బెనుబదియొక్క వేలును, శ్లోకంబులు గలిగియుండు. మఱియు, సనత్కుమారంబు, నారసింహంబు, నారదీయంబు, శైవంబు, దౌర్వాసంబు, కాపిలము, మానవము, ఔశనసము, వారుణము, కాలికము, సాంబము, నందికేయము, సౌరము, పారాశరము, ఆదిత్యము, మాహేశ్వరము, భాగవతము, వాసిష్ఠము, నను నుపపురాణంబులు పదునెనిమిదియు నార్షసమ్మతంబులై యొప్పారు. ౧౫౬

తే. ఎలమి నష్టాదశపురాణములను నుడివి,
యామునతనుజుండు సాత్యవతేయుఁ, డర్థిఁ
దదుపబృంహితమ్ముగ భారతమ్ముఁ బలికె,
నుద్ధరింపఁగ వేదబాహ్యులను గరుణ. ౧౫౭

క. ప్రతిమన్వంతరమందు
ప్రతి ద్వాపరమందు వ్యాసభగవానుండై,
హిత మాచరింప జగతికి
సతి కృప హరి యవతరించు నవతారంబుల్. ౧౫౮

వ. మహర్షిసత్తములారా! వినుండు. వైవస్వతాభిధం బగు నీ సప్తమ
మన్వంతరంబున నిరువదియెనిమిదవదగు ద్వాపరంబున, శ్రీహరి, సత్య
వతియందుఁ బరాశరుని వలన వ్యాసుండై యవతరించె. పరమధర్మ
విదగ్రగణ్యుఁ డగు సాత్యవతేయు గురు ననుగ్రహంబున నే నఖిల
పురాణసంహిత నభ్యసించితి. భవిష్యం బగు నిరువదితొమ్మిదవ
ద్వాపరమ్మున ద్రోణపుత్త్రుఁ డగు నశ్వత్థామ వ్యాసుండై యవత
రించు. కడచిన యిరువదియేడుగురు వ్యాసులును నాయాయుగం
బుల లోకహితార్థంబయి పురాణసంహితలఁ బ్రవచించిరి. అందుఁ
బ్రథమద్వాపరంబున స్వయంబుగా స్వయంభువు వ్యాసుండై, వేదం
బుల విభాగించె. ద్వితీయద్వాపరంబునఁ బ్రజాపతి వ్యాసుం డయ్యె.
తృతీయంబున ఉశనసుండును, చతుర్థంబున బృహస్పతియుఁ, బంచ
మంబున సవితయు, షష్ఠంబున మృత్యువు, సప్తమంబున మఘవుం
డును, అష్టమంబున వసిష్ఠుండును, నవమంబున సారస్వతాభిధానుం
డును, దశమంబునఁ ద్రిధామనాముండును, ఏకాదశంబునఁ ద్రివృషుఁ
డును, ద్వాదశంబున భరద్వాజుండును, త్రయోదశంబున నంతరిక్షుం
డును, చతుర్దశంబున ధర్ముండును, పంచదశంబునఁ ద్రయ్యారుణియు,
షోడశంబున ధనంజయుండును, సప్తదశంబున మేధాతిథియు, అష్టా
దశంబున వ్రతియు, ఏకోనవింశంబున అత్రియు, వింశంబున గౌతముం
డును, ఏకవింశంబున నుత్తముండును, ద్వావింశమ్మున వాజశ్రవుం

డగు వేనుండును, త్రయోవింశమ్మున ననుష్యాయణుం డగు సోముండును, చతుర్వింశంబునఁ దృణబిందువు, పంచవింశమ్మున భార్గవుఁడు, షడ్వింశంబున శక్తి, సప్తవింశంబున జాతుకర్ణుఁడు, అష్టావింశంబునఁ గృష్ణద్వైపాయనుండును, వ్యాసధర్మంబును నెరపిరి.

క. ఆ కృష్ణద్వైపాయన
ధీకల్పక దివ్యఫలము దీర్ఘాయుష్యం
బాకర్ణించితి వీనుల
నా కరుణాపూర్ణ గురుకటాక్షావాప్తిన్. ౧౦

క. వైరాగ్యయుక్తుఁ డై సం
సారార్ణవ దుర్విగాహ జలము తరింపన్
గోరి శ ం దర్శించినఁ,
బారాశర్యుండు దీని వాక్రుచ్చె దయన్. ౧౧

శా. శ్రీమద్భాగవతం బఘౌఘ్యములు తూలింపం బరంజ్యోతియై,
సీమాంతంబుల కార్తిమేఘములు పోఁ జిమ్మన్ మహావాయువై,
యామూలాగ్రము కుద్దలించు భవవృక్షౌఘంబు కుద్దాలమై,
కామాద్యం బగు శత్రుకానన మడంగం గాల్చు దావాగ్నియై.

శా. శ్రీమద్భాగవతంబు పుణ్యదము సుశ్లోకమ్ము మోక్షాస్పదం
బామోదావహ మిష్టకామదము శాస్త్రానేకసారాళి కా
రామక్షోణి రసైకపాత్రము శ్రుతిప్రఖ్యాతవాక్యార్థము
న్నామంజూష శుభప్రదం బది సమాకర్ణించినం బల్కెనన్. ౧౩

క. శ్రీమద్భాగవతామర
భూమీరుహ రుచిరఫల బుభుక్షువులారా!
ఈ మహాత్మ్యస్థితి మీరలు
నేమనంబున విన్న ముక్తిసిద్ధిఁ గనుటరుదే? ౧౪

శా. పాపీయుం డగు వేదధర్మవిహిత స్వాచారహీనుండు కా
నీ, పుణ్యోత్తరసత్పురాణము సద్భక్తిచ్ఛందంబుగా విన్నచోఁ,

బిడ్డ సర్వాంగముల్ ప్రేమతోఁ దడవుచు,
మై మెయి రాయుచు మరల రాయు;
ముఖము ముద్దిడుఁ బ్రేమతో ముఖముఁ జేర్చి
చూచుఁ, జూచినకొలఁగనే చూచి మురియు;
నద్భుతం బయి వాత్సల్య మతిశయింపఁ
జటకదంపతి కాత్మలో క్షణముక్షణము. ౧౭౫

తే. చాటకోరంబుపై నెదఁ జటకములకుఁ
బొంగు నద్భుతప్రేమపు బుగ్గఁ గాంచి
వ్యాసుని మనస్సు, మిగులఁ జింతాతురమ్ము
గాఁగ ని ట్లని తర్కింపఁగాఁ దొడంగె. ౧౭౬

ఉ. ఈ కలవింకయుగ్మ మతిహీనవిహంగమజాతి, కామభో
గైక సమర్థమాత్ర ముపయోగము వీనికి, వార్ధకంబునం
దీ కవపోషణం బయిన నిచ్చ్యాది చేసెడియాస లేదు; కా
నీ, కడుఁ జోద్య మయ్యె నివి యిట్టులు పొంగుట పుత్రజన్మకున్.

సీ. స్వర్గలోకావాప్తి సాధించునా పుట్టి?
మృతి గన్న జనుఁడు నా ప్రేతవిధులు?
సలుపునా గయలోన శ్రాద్ధపిండజలంబు?
విధిగ నీలోత్సర్గవిధి నెరపునొ?
ధన్యుఁడై వీనిఁ దనియించునో, పుణ్య
భాగ్యంబు విత్తసంపత్తిఁ గూర్చి?
పుత్త్రపరిష్వంగ భోగ మొక్కటి దక్క
యోజింప లే దే ప్రయోజనమ్ము;

నిట్టి తిర్యక్కులకె ప్రేమ యింత యైన
నెంత యనవచ్చు నరుల పుత్త్రేషణమ్ము?
లే దపుత్త్రునకుఁ బరంబు లే దటంచు
స్మృతులు ప్రత్యక్షముగను ఘోషించు శ్రుతులు, ౧౭౮

క. ఏ మగు సాధన మింతయు,
నీ మందిర మెన్నఁ డనుభవించునొ, యుంచున్,
భూమిని నెవ్వని దుఃఖ
ప్రభ మిత్తుఁడై, దుర్గతి నసపుత్రుఁడు కూలున్. ౧౭౫

తే. ఇట్లు వ్యాసుం డనేక థా యొసఁగుచింత
నుష్ణమై దీర్ఘ నిశ్వాస మెక్కు యూర్పు పుచ్చి;
నది విచారించి మనసు సుస్థిరము చేసి,
తపము చేయంగ మేరువు దరికి నరిగె. ౧౭౬

శా. హరియో మహేంద్రుఁడో కార్తికేయుఁడో సహస్రాక్షుండో లోకేశుఁడో,
వరుణుండో యముఁడో గణేశుఁడో జగత్ప్రాణుండో సప్తార్చియో.
వరదానప్రవణుం డెవ్వాఁ? డని మదిన్ వ్యాసుండు తర్కించుచుం
డ, నవిశ్రాంతిముఁ గొంత నారదుఁడు వీణాపాణియై కన్పడెన్. ౧౭౭

క. నారదున సురమునిఁ గాంచన
మిచ్చి సమర్చించి యర్ఘ్యమిచ్చి సుపాద్యం
బిచ్చుచుఁ గుశలం బడుగ, వి
యచ్చరముని, హేతు నడిగె వ్యాసుకలఁతకున్. ౧౭౮

తే. అంత, వ్యాసుండు దేవర్షి కనియె నిట్లు:
పుత్త్రవిహీనునకు లేవు పుణ్యగతులు;
సుతుఁడుఁ గామింతు; నామది సుఖము లేదు;
నాఁటి విచారింతు నందుకే పరల మరల. ౧౭౯

తే. పుత్త్రుఁ బుట్టు గలుగుఁ? బుత్త్రుఁ బ్రసాదించు
పుణ్యదైవ మెద్ది పూజ సేయ?
శరణు సొచ్చినాఁడ. సర్వజ్ఞ! సెలవిమ్ము;
యెవని పూజ సేతు? నేవి దిక్కు? ౧౮౦

క. వ్యాసుఁడు చేసిన ప్రశ్నం
బా సంయమివరుఁడు వించు ననే నాదృతి ని,

ట్లీ సంప్రశ్నమె విష్ణునిఁ
జేసెఁ మాతండ్రి మున్ను, చెప్పెద వినుమా. ౧౮౧

శా. శ్రీనాథుండు జగద్గురుండు విలసత్ శ్రీవత్సవక్షుండు ని
ధ్యానస్థుం డయి యుండ, వేధ యొకనాఁ డత్యద్భుతావిష్టుఁడై
కానన్ లేక తదీయహేతు, వెఱుఁగం గాంక్షించె దామోదరున్
శ్రీనారాయణు నాదిదేవు హరి శౌరిన్ విష్ణు సర్వాత్మకున్. ౧౮౨

తే. భూతభవ్యభవత్ప్రభూ! పీతవసన!
దేవదేవ! జగన్నాథ! తెలియఁ జెప్పు
మేనికై తప మొనరింతు? ధ్యేయ మేది?
విస్మయం బయ్యె ధ్యానింప విశ్వపతివి. ౧౮౩

క. నీ వాదికారణంబవు;
నీవే కర్తవు, సమస్త నిర్వాహకుఁడవున్;
నీవే సంహర్తవు తుది;
నీవే సకలార్థకరణ నిపుణుఁడవు హరీ! ౧౮౪

క. నీ నాభిన్ జన్మించిన
నే నీయాజ్ఞన్ సృజింతు నిఖిలజగత్తున్;
దానికిఁ గాలము రా, నీ
శానుఁడు, నీయాన, సమయఁజలుపును దేవా! ౧౮౫

క. రవి తిరుగు, టగ్ని కాల్చుట,
పవనుని చలనంబు, మఘవు వర్షించుట ము
న్నవు నివి నీయాజ్ఞనె; ప్రభుఁ
డెవఁ డుండుఁ బరుఁడు నీకు నిటు ధ్యానింపన్? ౧౮౬

తే. ఇట్లనంగ బ్రహ్మ, హరి వచియించెఁ బ్రీతి:
వత్స! విను మేకమనమునఁ బల్కుదాని,
స్థితికి నే, నీవు సృష్టికి, హతికి శివుఁడు,
కారణము లంద్రు సురదేవగణములెల్ల. ౧౮౭

క. కానీ నీకుఁ నా కీ
శానునకుం గారణంబు శక్తి యటంచున్
జ్ఞానులు శ్రుతిపారగు లగు
మానుల సిద్ధాంతవచనమార్గము, వత్సా! ౧౮౮

క. నాయందు శక్తి సాత్త్వికి,
యా యీశుని శక్తి తామసాత్మిక యగుఁ,
నీయందు రాజసం బగు,
నాయంబకు ముప్పురమును స్వాధీనులనే. ౧౮౯

క. నేను స్వతంత్రుఁడ నెన్నఁడుఁ
గా, నెఱుఁగవె శేషశయ్యఁ గనుమూయుదుఁగా,
నే నాశక్తి కధీనుఁడ
నై నిత్యము తపము సేతు, సదియే కొలుతున్. ౧౯౦

మ. ఒకనాఁ డా మెదవను జ్ఞ శ్రీ మెఱయుఁ, గ్రీడోల్లాసినై యుందు; నిం
కొకనా దానవకోటితో భయదమా యుద్ధంబు సర్వాంగముల్
వికలంబై చనఁ జేయుదుం; దెలిపవా సీక్షింపవా మున్ను జ్ఞ
స్తికి రాదో, మధుకైటభాసురుల వి విఖ్యాత దోర్యుద్ధమున్. ౧౯౧

తే. జగతి యేకార్ణవం బైన సమయమందుఁ
గర్ణమలభూతులై మదగర్వితు లగు
వారి వైదువే లేండ్లు పోరి జయముఁ
గంటి దేవీప్రసాదంబుకలిమిఁ దొడను. ౧౯౨

క. గడగడ వడఁకుచు బడలిన
వడువున సుడివడుచు వ్రాలి పద్మమునుండున్
పడియుంటి వపుడు చూడవొ
చెడిగెదు మఱి కన్నులార సురసిన దాసున్. ౧౯౩

తే. కూర్మమై క్రూర నరసింహమై కొలము సుయి
యేల తిర్యక్కు నేదు నే స్వేచ్ఛ యున్న?

నా పరాశక్తి, కింకరుండ నౌదు నేను;
హీనయోనిజన్మం బెవఁ డిచ్ఛగించు? ౧౧౯

తే. పూర్వ మొకమాఱు నాశార్ఙ్గ మూర్వి విఱచు
శిరము తెగిపోవఁగా హయశిరముఁ దెచ్చి
శిల్పిచే నీవె యోజింపఁ జేసినావు;
హయశిరుఁడ నైతి, నెఱుక యున్నదియొ లేదొ! ౧౨౦

క. శక్తికి స్వాధీనుఁడ నై
శక్తినె ధ్యానింతు నేను సతతము భక్తిన్;
శక్తికిఁ బరతర మగునది
శక్తుఁడఁ గా నే వచింప, సత్యము వత్సా! ౧౨౧

తే. ఆ మహావిష్ణు వాక్యము లబ్జజుండు
తాను విన్నవి నాకును దయ వచించె;
నఖిల కల్యాణ కామితావాప్తి యగును,
నీవు హృద్వీధి నిలుపు శ్రీదేవి పదమె. ౧౨౨

తే. వ్యాసుఁ డాలించి నారదువచనసరణి,
నాత్మ యుప్పొంగ దేవీపదాబ్జయుక్తిఁ,
దప మొనర్చెను మేరుపుకటమునందు
నంచుఁ బల్కిన సూతున కనిరి మునులు. ౧౨౩

## హయగ్రీవావతారము

తే. విస్మయం బయ్యె, నుతియించు వేద మెవని,
నాదిదేవుండు మాధవుం, డతని శిరము
దైవయోగంబుచే నెట్లు తెఱుఁగఁబడియె?
హయవదనుఁ డెట్లు లయ్యె జనార్దనుండు? ౧౨౪

వ. అనిన సూతుం డి ట్లనియె. ౧౨౫

భద్రం బౌనొక వమ్రి సృష్టమయి భూపాన్న్యస్థధన్వాగ్రము
చ్ఛిద్రింపన్, ధనువుఁ విముక్తమగు, నీ శ్రీనాథుఁ డున్నిద్రుఁడౌ.

తే. శివుని యాసతి నాదలఁ జేర్చి, యపుడు
వమ్రి నొకదాని సృష్టించెఁ బద్మభవుఁడు;
దేవకార్యముఁ దీర్ప సందిష్ట మయ్యు,
వమ్రి యొల్లక వేధతోఁ బలికె నిట్లు. —౯౫

ఆ. అలుకగల ప్రీతి యుడుచుట, కథమధ్య
విఱచుటయును, వేలుపఱచుటయును
నిసువుఁ దల్లినుండి, నిద్దురఁ జెఱచుట
బ్రహ్మహత్య లంచుఁ బల్కు స్మృతులు. —౯౬

గీ. ఏమి కోరి సేతు నీ మహాపాపంబు!
పాతకంబు సేయ ఫలము వలదె?
దేవదేవు నిద్ర దెలిపినఁ దో సఁగఁ
జేయు లాభ మేమొ చెప్పుమయ్య! —౯౭

వ. దానికి బ్రహ్మ యి ట్లనియె. —౯౮

క. సుఖభాగము గల్పించెద
మఖహవ్యములను వమ్రి! పార్శ్వమహా స్థలినిం బొ
మఖహవ్యము నీ కిచ్చితి;
సుఖముండుము; వేగ దీర్పు సురకార్యంబుల్. —౯౯

గీ. అ ట్లనుజ్ఞాత యై వమ్రి యంటి మొనవె
వేగ నేల నాసిన వింటి కొనను
విరియఁగా మౌర్వి ధనువును త్రరపుకొప్పు
ముక్త మయ్యె మహాధ్వని ముక్త మయ్యె. —౧౦౦

శా. శ్రోత్రభాగము దద్దరిల్లె నదరెన్, శ్రోత్రిత్ర బ్రహ్మాండమున్, స
ష్టోద్విఘ్నము లయ్యె వారినిధు, లబ్ధిప్రుల్ కలంగెన్. సు

శైలముల్ కంపము నొందె, దిక్కతుల వీచెఁ ఘోరవాతూలముల్,
ప్రాణస్థానమునఁ నిరంతర మహోల్కావర్షధారల్ పడెఁ. ౨౧౬

తే. ఇట్లు మహోత్పాతములు పుట్ట నెల్ల దిశలు
భూరిదుఃఖానుశంసన ఘోర మయ్యె,
నంధతమము వ్యాపించె నహస్కరుండు
కాన రాకుంట సుర లెల్ల గ్రమానుపడిరి. ౨౧౭

తే. కొంతవడి నంధకార మొక్కింత విరియ
వరమకుటకుండలోద్భాసి శిరము లేని
దేవదేవుని విష్ణుని దివ్యతనువు
వికృతరూపము గాంచిరి విధియు శివుఁడు. ౨౧౮

క. అయ్యో! నాథా! యిది యే
మయ్యా! ప్రభు! దేవదేవ! హరి! యెవ్వరిమా
యయ్యా! యిఁక ది క్కెవ రని
కుయ్యిడిరి యె సమస్త దేవకోటియు నార్తిఁ. ౨౧౯

తే. నీ వభేద్యుఁడ వచ్ఛేద్య నిపుణగతివి
మాయ కీశుఁడ వాట నే మాయ నోనిఁ
ప్రభు! జగద్గురు! నినుఁ గ్రిందు పఱుప లేదు;
నీవు లేకున్న మే మెట్లు నిలువఁ గలము? ౨౨౦

తే. రాక్షసులు కాదు చేయరు యక్షు లెవరుఁ,
జేసి లారంగ నిది మేమె చేసికొంటి;
నేమి చేసెదము? మే మిప్పు డెందుఁ బోదు?
మెవరు శరణంబు? మా కింక నేది దిక్కు? ౨౨౧

తే. శివవు నోగము లైన దేవనినహ మేడ్చు
చుండ వారించి దేవగురుండు పల్కెఁ:
నిట్లు పరిదేవనము చేయ నేమి లాభ?
మేది యైన నుపాయ మూహింప వలయు. ౨౨౨

క. దైవంబుఁ బురుషకారము
దేవతలారా! సమంబ, తెలియుఁడు మదిలోఁ;
నేవాఁ డుపాయశాలియొ,
యావానికె యెప్పుడు దైవ మనుకూలించున్. ౨-౨౧

తే. ఇంద్రుఁ డది యాదరింపక యిట్లు పల్కెః
దైవమె పరంబు పర మని తలఁతు నేను;
పురుషకారంబ దేల! ఛీ! సురలయెదుట
ఛిన్న మైనది విష్ణుశిరము కనమె? ౨-౨౨

తే. సంశయోచ్ఛిత్తికై యంత స్రష్ట పల్కెఁ:
గలుగును శుభాశుభంబులు కాలవశత;
దేహి సుఖదుఃఖములు గుడ్చి తీరవలయు;
దైవము నతిక్రమింపఁగా దక్షు లెవరు? ౨-౨౩

క. నాశిరము మున్ను త్రెవ్వఁడె
యీ శంభుఁడు? శాపవశత నితనికిఁ గూడన్
నాశం బొందదె లింగము?
శ్రీశునిశిర మిపుడు పడియె సింధువులోనన్. ౨-౨౪

ఆ. వజ్రి యెన్నిమార్లు స్వర్గవిచ్యుతుఁ డయ్యె?
నొక్కతఱి సహస్రయోని యయ్యె;
భవము నొంది దుఃఖభాక్కు కాని దెవండు?
కాన శోక మొందఁ గాదు బుధులు. ౨-౨౫

తే. బ్రహ్మవిద్యాత్మ యెది, పరాప్రకృతి యెవ్వ,
రేయమ సనాతనీమహామాయ యందు,
రా జగద్ధాత్రి జనయిత్రి నఖిలధాత్రి
శరణు వేడుఁడు, మీకోర్కె సఫల మగును. ౨-౨౬

ఆ. ఇట్లు పలికి సుంత యెదలోన ధ్యానింప,
నిలువఁ బడియె నెదుట నిగమరాశి,

దినకరాయమాన దివ్యతనువు దాల్చి,
దేవకార్యవిధముఁ దీర్పఁ గోరి. ౧౨౭

ఆ. సర్వకార్యసిద్ధి సాధనీభూతము
పరమగూఢ మైన బ్రహ్మవిద్య
వినుతి సేయుఁ డంచు వేధ యాదేశింప
శ్రుతులు దేవి నిట్లు స్తుతి యొనర్చె. ౧౨౮

## వేదకృత దేవీస్తోత్రము

క. మాతల్లి! నమస్కారము
చేతుము విశ్వైకజననీ! శివకామేశీ!
భూతముల కెల్ల భూమీ
భూతవు, ప్రాణులకుఁ బ్రాణభూతవు దేవీ! ౧౨౯

క. శ్రీ ధీ కాంతి క్షాంతులు,
మేధా శాంతులును, శ్రద్ధ స్మృతియుఁ ధృతియున్,
నీ ధామంబున వెలిఁగెడి
దీధితులే కాదటమ్మ త్రిదశజనిత్రీ! ౧౩౦

క. గాయత్రీ వ్యాహృతులును
నా యుద్గీథార్ధమాత్ర యను ధాత్రివి నీ
వో యంబ! కీర్తి లజ్జలు
నాయత విజయా జయా దయా స్పృహ లీవే. ౧౩౧

ఉ. అమ్మ! జగత్త్రయమ్ముఁ గనినమ్మ! జనమ్ములు నమ్మినమ్మ! లో
కమ్ముహితమ్ము నెమ్మదిఁ గమ్మినయమ్మ! దయారసైకమూ
లమ్మగు నమ్మ! సంసృతిఁ గాలంచి శివ మ్మొనగూర్చు విద్యవై
నమ్మ! వరేణ్య వాగ్భవ హృదాలయనమ్మ! నుతింప నిమ్మమా!

క. స్థావర జంగమములకున్
నీవే జనయిత్రి వగుట నీ పసిపాపల్

గోవింద విధి గిరీశులు
దేవేశ దినేశ భువన దిగధీశు లుమా! — ౧౩౩

తే. ఎన్నఁ డీ విశ్వసృష్టి కామింతు వంబ!
యంత హరి హర విధుల సృష్టింతు వీవు;
స్థితి లయ విసర్గములు వారిఁ జేయఁ బూన్చి,
నేకవై యుందు సంసృతి యేమి లేక. — ౧౩౪

శా. నీరూపం బెటులుంగనన్ సమర్థునిఁ గనన్ లే మీ ప్రపంచంబునన్?
నేరం బోలు నవంబు నామములనేని నీవి లెక్కింపఁగా;
నూరం జన్మి మహంబు దాఁట బరునై, యుద్యోగుఁడైనన్ మహా
పారావారము నూహవారిఁ దరియింపన్ సాధ్యపాత్రం బగున్. — ౧౩౫

తే. నీవు భువనైకజననివి, నీమహత్త్వ
దేవతలలో నొకండును దెలియఁ డంబ!
యెట్లొకానొకో యీ జగద్విధ్య సృష్టి సేతొ,
తెలియఁగ నెట్లు శ్రుతిప్రమాణేతరమున? — ౧౩౬

తే. నీచరిత్రంబు చిత్రంబు నిఖిలసృష్టి
కారణామ వయ్యును నిరీహ కారయుంగ,
నీస్వరూప మందదు మాకు మనములకే,
యెవ్వఁ డెఱుఁగ సమర్థుఁ డే, నెట్లు సెప్పు? — ౧౩౭

చ. ఎఱుఁగవా తల్లి! యిప్పుడ యుపేంద్రుఁడు శీర్ష మదృశ్య మాయెటు? నా
నెఱిఁగియు నిచ్చగించవొ రమేశున శక్తి పరీక్ష సేయ? నీ
హరి నొసఁగించినట్టి దురితౌఘ మవార్య మటంచు నందగో?
దురితము లున్నె నీ చరణాంబుజగంధ సమాశ్రితాళికిన్? — ౧౩౮

మ. జననీ! విష్ణుశిరఃప్రపాతము మహాశ్చర్యంబు, తత్స్థానమం
దెసఁ దెచ్చున్; హరినెత్తిఁ జుట్టె సురానీకంబు దోషం బదే,
వినుకేంద్రుల్ సవ మొందిరి నను సంతర్పించి పూజన్, జనా
ర్దనుగర్వం బుపశాంత దలంచెదవా, వినోదం బయ్యెనో యీక్రియన్?

క. శ్రీదేవి పల్కె నిట్లని:
"యో దానవ! నీతపస్సు కూర్జస్వితమై
నీదగు భక్తికి శ్రద్ధకు
మోదించితిఁ గోరు మిత్తు ముద నేవరమో?" —౧౫౩

క. ప్రమదానహ మద్భాషల
క్రమందహాస్యంబు నొంది, యౌత్సుక్యముతో
సమరమ్మున నజయత్వం
బమరారి యపేక్ష సేయ నాతని కంటెన్. —౧౫౪

క. పుట్టినవారలు. తథ్యము
గిట్టుట, జన్మంబు ధ్రువము గిట్టినయెడ; నీ
విట్టి జగన్మర్యాదన్
నెట్టన భావించి కోరు నిజవర మేదే. —౧౫౫

తే. ఆ హయగ్రీవుఁ డర్థించె నంత నన్నుఁ;
దను హయగ్రీవుఁ డొక్కఁడు దక్క నొరులు
చంపలేకుంట; నట్ల యొసంగినాను;
వాఁడు వరగర్వమున మీఱినాఁడు నేఁడు. —౧౫౬

ఆ. తామసాత్మ నన్ను ధ్యానించుటన్ వాఁడు
వేదములను మునుల వేధసేయు
హయశిరం బొకండు హరినేన సంధింపఁ,
జచ్చుఁడు మాన్పు నంత నసురబాధ. —౧౫౭

క. శరదాగమ శుభ్రాంభో
ధర శుభ గంభీరహారి భాషణము లింపుల్
పరమేశ్వరి పరపించిన
సురసంఘము లేచె కార్యతత్పరత మెఱయన్. —౧౫౮

క. పరమానందాశ్రుపరం
పర యొరలం గనుల, మేన భరముగఁ బులకల్

తే. సాత్త్వికశ్రవణంబును తత్త్వవిదులు
ముఖ్యమగు నటంచు వాక్రుత్తు; రందు
మోక్షదం బుత్తమము, స్వర్గముం దలంప
మధ్యమము, భోగదం బధమం బటంచు. ౨౭౯

క. త్రివిధము సాహిత్యము, స్వీ
యవనితయం దుత్తమంబు, నల వేశ్యాస్త్రీ
సవహంబున మధ్యమ మగు,
నవు నధమం బన్యయువతులం దగు నెడలన్. ౨౮౦

తే. ఉత్తమం బాతతాయితో యుద్ధ మైన;
మధ్యమంబు విద్వేషిప్రమర్దనంబు;
నిర్నిమిత్తవివాదంబు నిర్నిమిత్త
కలహ మధమము, తామసకథయు నట్లు. ౨౮౧

క. కాన పురాణశ్రవణము
జ్ఞానం బొనగూర్చు, బుద్ధిసంపదఁ బెంచున్,
ఏనోనాశము, సంప
ద్దానంబును జేయుఁ, జెప్ప దగు దేవికథల్. ౨౮౨

వ. నావుడు సూతుం డిట్లనియె. ౨౮౩

క. ధన్యులు మీరు మహాత్ములు;
ధన్యుఁడ నే; నుభయులమును ధన్యుల; మీరల్
ధన్యులు వినఁ దివ్రుకటచే
ధన్యుఁడఁ గథనమున బుద్ధి దనుకుట నేనున్. ౨౮౪

మధుకైటభులు వరంబులు పడయుట

తే. మున్ను కానొక లయవేళ మునిఁగిపోయె
భువనములు మూఁడుఁ గనరాక పూర్ణజలధి;
సచ్ఛ్రితం బయ్యె నప్పు డేకార్ణవంబు,
శేషపాన్పున సుఖసుప్తిఁ జెందెను హరి. ౨౮౫

తారధ్వని యాకసమున
వారికి విన నయ్యె శ్రవణపర్వం బగుచున్. -౧౮౩

తే. వ్యగ్రులై వారు భక్తిఁ బరిగ్రహించి
యభ్యసించిరి దృఢముగా నదియు, వారి
కప్పుడు సౌదామినీరేఖ యంబరమున
నద్భుతం బయి నెలసి ప్రత్యక్ష మయ్యె. -౧౮౪

తే. ఆదియె మంత్రము సగుణమా ధ్యాన మనుచు
నిశ్చయించి విచారించి నిష్ఠతోడ
నశనమును నిద్ర మాని జితాత్ము లగుచుఁ
దజ్జపాభ్యాసు లైరి నక్తందినమ్ము. -౧౮౫

ఆ. వార లిట్లు తపము వర్షసహస్రమ్ము
నెరపఁ బ్రీత యయ్యెఁ బరమశక్తి;
దివి శరీరహీన దివ్యవాక్కుల, నిష్ట
వరముఁ గోరుఁ డంచుఁ బలికె నదియు. ౧౮౬

క. సురరిపు లది విని స్వేచ్ఛా
మరణం బర్థింప నద్దియు నిటు పల్కెన్,
మరణం బట్లు కావుత,
మఱి సురదైత్యుల కజేయ మహిమం గనుఁడీ. -౧౮౭

క. ఇట్లు దేవీపరివర్ధిత
పటు దర్ప శరీరు లగుచు వార్ధి జలములన్
నటదూర్ముల నటియింతురు
చటులిం ద్రైదుష్టైన నట్టి జలసత్త్వమునన్. -౧౮౮

## మధుకైటభులు బ్రహ్మను ధర్షించుట

క. యాదృచ్ఛికముగ నొకనాఁ
డా దైత్యులు గాంచి రందు నబ్జాసనునిన్
వేదంబులు నలుమొగముల
నాదవినోదంబు చేయ నందించు విభున్. -౧౮౯

శ్రీపతి యోగనిద్రకు వశీకృతుఁ డౌట ధ్రువమ్ము, శక్తి సు
మ్మీ పరమేశి, తథ్యము, భజింతు ననాథశరణ్య దానినే. ౬౫

తే. నిద్ర హరివశమై లేదు నిశ్చయమ్ము;
హరియె యున్నాఁడు నిద్రావశాత్ముఁ డగుచు;
దేని కెవ్వఁడు వశుఁడో, యదాని కతఁడె
దాసుఁ డౌఁగాక, యీశుఁ డేదారి నగును? ౬౬

తే. సృష్టిపాలనలయకారి శ్రీవిభుండె
కింకరుండైన శక్తికిఁ, గింకరులము
నేను శంభుండు నీ జగన్నివహ మనుచు
యోగనిద్రా స్తవము భక్తియుక్తిఁ జేసె. ౬౭

## బ్రహ్మకృత యోగనిద్రా స్తవము

ఉ. ఆగమసూక్తిచేత జగదాదివి నీ వని జ్ఞాతమయ్యెఁ, బ్ర
థ్వీగురుఁ డీ యధోక్షజుఁడు దేహ మెఱుంగక యిట్లు నిద్దురం
దోఁగుట చూచి నే నిటులఁ దొట్రిలఁజూచి విస్మయింతుఁ, జ
ల్లీ! గణుతింప నీ బహుళలీలల నేవిబుధుండు శక్తుఁడో? ౬౮

తే. ఈజగత్కర్త్రిఁ జైతన్యహీన మైన
ప్రకృతిగా నిన్ను వర్ణించి పలుకుసాంఖ్యు
లెంతె మందవిచారులే! యెట్లు జడమ
యీ హృషీకేశుఁ జైతన్యహీనుఁ జేసె? ౬౯

క. నీ నానాగుణసటన వి
ధానం బెవఁ డెఱుఁగఁ జాలుఁ, దల్లీ! నను సం
ధ్యానామమునఁ ద్రికాలము
ధ్యానింతురు వరులు తాత్పర్యమునన్. ౭౦

తే. బోద్ధలకు బోధకారణబుద్ధి వీవు,
దేవసుఖపేతు వైన శ్రీ వీవ దేవి!

సకలజనముల కీర్తియు శ్రద్ధ నీవ,
మతియు రతి నీవ, కాంతియు ధృతియు నీవ. ౩౦౩

ఉ. అక్కడ వాక్కు నెవ్వరుగు, నందు మనస్సు నివృత్తమౌను, నే
నొక్కటి నేర్తు దాసిఁ గన నోప నటంచు, ననంతమైన నా
వాక్కులు దాని సన్నుతనవాయు వటంచును, వేదమాతయే
యెక్కు నఁ జిక్కని ట్లెలియఁ జెప్ప, నిఁ కేరికి సాధ్య మౌ నుమా!

తే. తర్కకోటిఁ బ్రమాణశతంబుచేత
నిను నెఱుఁగ నైతినే బహుజ్జనము వినుచు,
నేఁడు ప్రత్యక్షముగ హరిఁ బ్రదఁ జూచి
యెఱిఁగితిని, నిను హరిహరు లెఱుఁగ రంబ! ౩౦౪

క. స్వాహా యని నీనామ
వ్యాహృతి లేకుండ శ్రౌతయాజ్ఞికవిధులం
దే హోమము చేసిన యు
త్సాహరము సురల కెట్లు లందును? జననీ! ౩౦౫

క. సర్వసు దేవతలకు నీ
వే వృత్తిప్రదవు, విష్ణుఁ డంబ పిలిచినన్
జీవం; డీ మధు కైటభ
దేవారిభయంబు నీవె తీర్పుము తల్లీ! ౩౦౬

క. ఆయోధ్యా బలదృప్తులై
బలు యయ్యసురలు నిలిచి యెదుట నీ దుష్టులు లోఁ
గయ్యం బొనరింపఁగ భయ
మయ్యెడి, రక్షింపు శరణ మంటిని దల్లీ! ౩౦౭

ఉ. నీపదపంకజంబు లెద నిల్పి భజించుచు నన్యదేవతా
రోపణ చేయ నోయుచును లోకవిధాత్రివి కామదోగ్ధ్రివా
నీపరమైన భావనల నృత్యము సేయుచు నీపదంబు లా
లాపన చేయుచున్ నినుఁ దలంచుచుఁ జొక్కు మహాత్ములే కృతుల్.

కరుఁ బంచాస్యు హిమాంశుశేఖరు జగత్కల్యాణకృత్ త్ర్యంబకున్
హరు హుంకార విఘాతి మన్మథ మహాహంకార లంకారునన్.

క. ఉద్యంతుఁ డస్తమానుఁడు
నౌ ద్యుమణిని నుభయసంధ్య లర్ఘ్యాహమునం
దాద్యుం డని ధ్యానింపఁగ
నుద్యోగించెదరు వైదికోత్తములు ద్విజుల్. ౩-౧౧

క. కొందఱు కొలిచెద రగ్నిని,
గొందఱు కొలుతురు మహేంద్రుఁ, గొందఱు రవినిన్;
కొందఱు సధికుఁడు విష్ణుం
డందురు ఋషివరులు గంగయుష్ట్రాలు సదులన్. ౩-౧౨

వ. ప్రత్యక్షము, అనుమానము, శాబ్దము అని ప్రమాణములు మూఁడు. కొందఱు ఉపమానంబుతో నాలు గనియు, మఱికొందఱు అర్థాపత్తిం గలిపి యైదనియు, మీమాంసకులు అనుపలబ్ధితో నాఱనియు, ఐతిహ్యమును జోడించి పౌరాణికులు ఏడనియు, వచించిరి. ఎంత యీ ప్రమాణములను నొడివినను, పరబ్రహ్మ మప్రమాణములకు అందరానిదై యొప్పు. ౩-౧౩

తే. శ్రుతి విచారించి ప్రత్యక్షగతిఁ దెలిసి
శిష్టపథమున దృష్టాంతచింత చేసి
తర్క మొనరింపనగు బుద్ధిఁ దఱచి తఱచి
యిది పురాణముల్ మునులు కీర్తించుపథము. ౩-౧౪

సీ. స్రష్టను లోకంబు సృష్టించుశక్తియు,
వైకుంఠునందుఁ దద్భరణశక్తి,
హరునందు సర్వసంహారకశక్తియు,
సంప్రకాశకశక్తి సవితృనందు,
దహనునిలో సర్వదాహకశక్తియుఁ,
బ్రేరణాశక్తి సమీరునందు,

క. అనవరతసేవ్య శక్తియె,
వినుఁ జనదు తలంప రాదు వే అను నుడువుల్,
వినికి గల బుధుఁడు కన్నుల
కనలేఁ డేశక్తిహీను ఘనజడిమంబున్! 33.

ఆ. శక్తిరూప మిలు ప్రసంగించి సూతుండు
పరవశాత్ముఁ డగుచు భక్తియుక్తిఁ
గనుల హర్షబాష్ప కణములు దనుకఁగా
గోట మీటి యందుకొనియెఁ గథను. ౩౪

హరి మధుకైటభులతోఁ బోరుట

మ. హరి నేత్రంబులు వీడి నాసికయు నాస్యంబున్ విసర్జించి కం
ఠరభాగంబు త్యజించి బాహుహృదయాంతస్థ మూరుస్థలిన్
బరివర్జించి పదంబు లిట్లు విడుచన్ సర్వాంగముల్ వీడి యం
బరమార్గంబున యోగనిద్ర సలిపెన్ భద్రప్రదాద్రభ్రమై. ౩౫

క. జృంభాసంరంభుండై
స్తంభితరూపంబు వీడి సద్యోజాతో
జ్జృంభిత చేతనుఁడై హరి
యంభోజజుఁ గాంచె నెదుట నత్యంతార్తున్. ౩౬

క. జలధరగంభీరధ్వనిఁ
బలికెన్ హరి, తపము వదలి వచ్చితి వేలా?
యులికెద వేలకొ? చింతా
కులతం బొక్కెద వ దేలకో? విధి! చెప్పుమా. ౩౭

వ. అని యాదరంబున నడుగు విష్ణుదేవునకు బ్రహ్మదేవుం డిట్లనియె.

శా. దేవా! యీమధుకైటభుల్ శ్రవణపూతిన్ నీకు జన్మించి బా
హావిస్ఫూర్జితదీర్ఘదేహులు మదాంధ్యాయత్తచేతస్కులై,
నా వెంటం బడినారు ఘోరముగ జన్యం బిట్లపేక్షించుచున్,
లేవయ్యా ననుఁ గావ; వీరిశిరముల్ ఖండింపవయ్యా, హరీ! ౩౮

కోఁచింపక హరితోఁ యు
ద్ధాచరణకు సిద్ధు లగుచు నార్చిరి పెలుచన్. ౩౮౫

ఉ. అంత నిరామయం బగు మహార్ణవసంచల దూర్మిమాలికా
సంతతులందుఁ గాళ్ళు నిలుపఁ జాలని చోట మహాద్భుతంబు న
త్యంతభయంకర మ్మగు మహాసమరం బొనరించె శౌరి యా
సాంతము వారితోడ ననహాయుతఁ బంచసహస్రవర్షముల్. ౩౮౬

క. కాలెను బోరితోఁ దలద్వంద్వము
మీఁటి రుషన్ వృషభరాజుమీఁదఁ గవియుచున్
బేరెములు వాఱు భంగిని
బోరిరి మధుకైటభులును బురుషోత్తముతోన్. ౩౮౭

క. మధు వలసెఁ గైటభుఁడున్,
మధుపుం గైటభుఁడు బసల, మఱి కైటభుఁడున్,
మధునై మఱి యీవిధమునఁ
బ్రధనం బొనరించిరి వారు పర్యాయమునన్. ౩౮౮

తే. ఆ నిరామయమైన యేకార్ణవమున
నామహార్ణవమైన సంగ్రామమునకుఁ
బ్రేక్షకులు నిర్వ్యాజ యంబికామంద
యోగనిద్రయుఁ గ్రీడకుఁ దోఁగు విధియు. ౩౮౯

క. ఇక్కరణిన్ సంక్షోభఁ
డొక్కఁడు మొగిన్ విరతి లేక యుగ్రాహవ మా
రక్కసులతోడఁ జేయఁగఁ
జిక్కెన్ హరి; యక్కజముగఁ, జిక్కరి దైత్యుల్. ౩౯౦

ఉ. పంచసహస్రవర్షము లవారణ యుద్ధ మొనర్చి యంత యో
జించెఁ ద్రివిక్రముం డిది విచిత్రము ప్రాంతమునందు నైతి, నిక్క
క్కించుక ప్రసక్త్యన్ను కనిపింపరు దీనికి హేతు వేమి? నా
యంచితశౌర్యమున్ బలమహత్త్వము నేమయె? నెందుఁ బోయెనో?

నా దూరంబు తొలంగువార మిదె నీ వర్థించు విశ్రాంతి యీ
లే దంచుం జెప మేల మా కనుచు దూరీభూతులై నిల్చినన్.

## విష్ణు కృత దేవీ స్తుతి

క. అతిదూరము వా రరిగినఁ
జతుర్భుజుఁడు చింతచేసె సంయతమతి యై,
దితిసుతమరణోపాయము
నతనికి నతిదీర్ఘచింత నాశ్చర్యంబై. 37

క. విద్యుద్రేఖాస్ఫూర్తి స
ముద్యోతిత మయ్యె జ్ఞాన మూహాతీతమునం
దాద్యశ్రీదేవిద
యోద్యత్ స్వచ్ఛందమరణ యుక్తు లటంచున్. 38

శా. అయ్యో, పంచసహస్రవర్షకృత మీ యాయోధనం బంతయు
నయ్యెన్ వ్యర్థము, వ్యర్థమయ్యె శ్రమ, మాహా, యెట్లు పోరాడెదన్?
కయ్యంబుం బొనరింప నీ జయము శక్యం బౌనె ప్రాపింపనే
నెయ్యోజన్ మధుకైటభప్రమథనం బీవేళ సాధించెదన్! 39

క. దీనుఁడు రోగియు నార్తుం
డేనియు మరణింపఁ దాన యియ్యకొనం, డీ
దానవుల బలమదాంధుల
నే నేటు మరణింప నిచ్ఛగింప నొనర్తున్? 40

తే. అఖిలకామప్రదాత్రి విద్యాస్వరూప
శక్తి యొక్కతె యామె నాకు శరణ మిపుడు,
సుప్రసన్నాత్మ యై యామె చూచు నెడలఁ
గోర్కె సిద్ధించు, రక్ష దిక్కొకం డింక లేదు. 41

క. నగ నొందుచు నిటులన్ హరి
గగనంబున యోగనిద్రఁ గనె సన్నిద్రన్,

ప్రావృట్తటిల్లతోపమ నవ మల్లికా
 వర్షధారల జిహ్వ బడలుపరచి,
ధూమకేతురూక్ష ధూమ్రమనీలోత్పల
 శూలహతుల నవయువాళి నొంచి,
కామపంచబాణ కమనీయ ఘోరమై
 దేవివక్రదృష్టి తేజరిల్లె. ౩౮౨

క. పంచేంద్రియ సమ్మోహన
చంచత్తన్మాత్రదృష్టి సాయక హతులన్
వంచితులై యసురలు వీ
క్షించుచు ననిమేషులైరి శ్రీశివమాయన్. ౩౮౩

క. కర్తవ్యవేది దానవ
హర్తయు దేవీప్రయుక్త హాసస్రగంతా
వర్త హతాద్వర్తన మో
హార్తులుగా వారి నెఱిఁగె నాక్షణమందున్. ౩౮౪

క. వారికి హరి జలధరగం
భీర మనోహర ధీర విశదస్వరుఁడై,
ధీ రాజిల, స్మిత మలర, సు
రారుల వీరత నుతించి యనె నీరీతిన్. ౩౮౫

ఉ. వీరవరేణ్యులార! యతివేలము మీ రణకౌశలంబు దే
వారులకోట్లలోఁ గనఁగ లాడితిఁ గాని యెఱుంగ నెన్నఁడీ
సారము మీపరాక్రమ మసాధ్య మపూర్వము, మేలు, మెచ్చితిన్,
కోరుకొనుండు మీర, లొనగూర్తు వరం బది యెట్టిదేనియున్.

క. భువనానందవిధాత్రిని
భువనేశ్వరిఁ గాంచి మోహమూర్ఛావశులై,
యవలేపం బభిమానము
ఛిప్పురింపఁగ వారు మాఱు చెప్పిరి హరికిన్. ౩౮౭

తే. యాచకులు గాఁగ మము నెంతువా రమేశ!
నేమె దాతల మగుదుము, మెచ్చు వచ్చె;
నీ నియుద్ధ మమోఘంబు నిరుపమంబు,
కోరు వర మేదియే నిచ్చువార మేమె. 357

క. వెంటనె హరి యా యసురల
జంటను ప్రార్థించె నిట్లు సంతుష్టులరై
యుంటిర యే నాచే మృతిఁ
గొంటకునై యిచ్ఛగింపఁ గోరుదు మిమ్మున్. 358

తే. హరివరంబు వించు నసుర లచ్చెరు నంది
మోస పోతి మంచుఁ బొగిలి మిగుల
క్షీరచింత చేసి తిలకించి రెల్లెడ
నీరు తప్ప లేని వారిరాశి. 360

తే. వార లంత నిట్లు పల్కిరి హరితోడ,
నీవు మా కొసంగినావు వరము,
సత్యసత్యవచన! సర్వహింపు ప్రతిజ్ఞ,
చంపు జలము లేని సమతిలి మము.

ఉ. దానవ వైర యంతట సుదర్శనచక్ర మనంతవక్త్రమున్
ధ్యానము సేసి నెమ్మది సురారుల కట్లని పల్కె మందహా
సాననభాసురుం డయి, తథాస్తు వరంబు నిజంబు సేతు మీ
ప్రాణములన్ హరింతు నిదె వారివిహీన సమస్థలంబునన్. 362

తే. దేవదేవేశుఁ డిట్లు పల్కి దివ్యశక్తి
నూరువు లొనర్చె బహుళవిస్తారములుగ,
జలముపైఁ జూపి నిర్జలసమతలంబు,
పట్టె మధుకైటభుల నట్లు పరమగురుఁడు. 363

ఆ. ఇచట లేదు సలిల మిం దుంచుఁడు శిరంబు,
లేను సత్యవాక్కు నిపుడ యాదు;

మీర లట్టి వరము మీఱకుండఁ బ్రతిజ్ఞ
నెఱపనలయు మరణనిశ్చయమున. ౩౬౮

ఉ. యుక్తివివేకు లా యసురయోధులు శ్రీహరిసంప్రయుక్తధీ
రోక్తులు వించు విష్ణు విపులోరుతలిం బొడగాంచి జీవనా
సక్తి మదిన్ విచారణము సల్పి యుపాయ మెఱుంగుచున్ మనః
శక్తి సహస్రయోజనవిశాలశరీరులు గాఁగ వర్ధిలన్. ౩౬౯

శా. దేవేశుండు త్రివిక్రముం డసురవిద్వేషి ప్రయుంజాన మా
యావిజ్ఞాని నిమేషమాత్ర ఘనుఁడాయామంబు ద్విగుణ్యాతి
లావిస్తార మొనర్చి పెల్చె, నసురల్ సంభ్రాంతులై విష్ణుమా
యావైదగ్ధ్య విమూఢ చిత్తత ననన్యాయత్తులై యుండఁగా. ౩౭౦

క. లక్ష్మీక్రీడాస్థానం
బా ...దేవిప్రసారితాకారం బౌ
లక్ష్మీనాథుని విపులా
సూక్ష్మోరుమహత్త్వ మప్పుడు చూచిరి దనుజుల్. ౩౭౧

క. మధువైరిసమాహ్వానము
మధుకైటభు లాలకించి మహా ...
ర్వ్యర్థులై తమ శీర్షంబుల
నధివాస మొనర్చి రప్పుడు హరియూరుపులన్. ౩౭౨

క. నఱికెను మధుకైటభభా
స్వరశీర్షమ్ములను జక్రి చక్రముధారన్,
పరివర్జితజీవం బగు
సురారియుగళమును బ్రాపిన్ గాంచె నలువ మురన్. ౩౭౩

క. యాదోరాశిన్ వారల
మేద స్స్రవిడలఁ బర్వి మేదుర మగుటన్,
మేదిని యను పే రొలసెను
మేదినికి; నభక్ష్య మయ్యె మృత్తిక దానన్. ౩౭౪

మహితాశ్చర్యతపమ్ము వ్యాసముని నేమం బొప్ప దేవీపదో
ద్వహవృత్తుం డయి చేసె నిస్తులలసద్భక్తిం శతాబ్దాంతముల్.

క. వసుధకు నాకాశమునకు
శ్వసనునకును పావకునకు సరివచ్చు ఘనుల్,
ప్రసవింతుం గావుత సుతు
నసమజ్ఞానప్రభావు నని ధ్యానించెన్.

తే. సల్పఁగఁ దపస్సు వ్యాసు తేజస్సు పొంగి
వ్యాప్తమై విశ్వ మొప్పెఁ జరాచరంబు;
నగ్ని వర్ణంబులై నెల్లె నతని జడలు;
భయపడె సురేంద్రుఁడు, డభవుఁ డా భయముఁ బాపె,

క. ప్రత్యక్షు మగుచు వ్యాసున
కత్యంతప్రీతిఁ గూర్చి యనె సుందరుఁడై.
సత్యామల తేజోనిధిఁ
బ్రత్యద్భుతసు జ్ఞాని సుతుఁ బడసెద నంచున్.

క. దేవీవామాంగు మహా
దేవుఁడు చంద్రార్ధమౌళి దీవించి చనన్
సేవించి స్తుతి నమస్కృతిఁ
గావించి నిజాశ్రమమునకుఁ గ్రమ్మరె మునియున్.

## శుకోత్పత్తి

క. ఆవ్యాసమహాసి యంతట
నవ్యక్తంబైన యగ్ని యుద్భూతింబై
సువ్యక్తముగా నరణిన్
భవ్యము చేయుచు మథింపఁ బ్రారంభించెన్.

క. మంథన మొనరుచు మునిమిగు
సంధిల్లె విచార మిట్లు సద్యస్స్ఫూర్తిన్

మంథానారణి దంపతి
సంధానోజ్జ్వలిత వహ్ని సందీప్తుండై. ౨౧౪

క. సుతుఁ డెట్లు గల్గు నాకుఁ
సతి జాయగఁ బరిణయంబు సలిపి యెఱుఁగ; నే
నతిరాం పదనిగడాయిత
స్వాతంత్ర్యతారోధి నతివ పరిణయించు టెటుల్! ౨౧౫

సీ. అట్లు చింతించుచుఋషికిఁ బ్రత్యక్ష మయ్యె
నప్సరోరత్నము ఘృతాచి యంబరమున;
వెంటనే కామసుమబాణవిద్ధుఁ డయ్యె,
ధృతి వహించి, వ్యాసర్షి చింతించె నిట్లు. ౨౧౬

క. ఘృతాచి నైన నాకుం
జిత్రం బీ మోహవశత, ఛీ! బుధనిందా
పాత్రము నగుదునె, యిదియు న
పాత్రము నా జాయగాఁగఁ బరిణయ మాడన్. ౨౧౭

క. పూర్వము పురూరవోవిభుఁ
డూర్వశిచేఁ బరిభవంబు నొందఁడె రతుఁడై?
గూర్వాహతిఁ జిక్కఁ బట్టుదు
సర్వేంద్రియముల నని మూసి సంయమిఁ డయ్యెన్. ౨౧౮

క. వియదధ్వమున ఘృతాచియు
భయవిహ్వలయై యెలుంగు పరపుచు దిశలన్
నయమున శుకమై, ముని వి
స్మయ మందఁగ నెగిరిపోయె శరవేగమునన్. ౨౧౯

క. తఱువంబడు నాయరణిన్
హిరణ్యరేతుండువోలె వెసఁగుచు దీప్తిన్
బరమాద్భుతముగఁ బుత్త్రుఁడు
వరదానమహత్త్వమునన ప్రభవము నొందెన్. ౨౨౦

చ. శిశువుశిరంబుపై సురలు చిల్కిరి పూవులవాన, దుందుభుల్
విశదములై ధ్వనించె దివి, విశ్రుత మయ్యె వరాప్సరోంగనా
గణనటనానుకారిపదలాస్యము, పాడిరి కిన్నరాళి ము
ద్వాశు లయి, చూడవచ్చిరటఁ బర్వత తుంబురు నారదాదులున్.

క. గంగాపుణ్యజలంబుల
సంగాహింసంగఁ జేసి స్వప్రియతనయున్,
మంగళదివ్యాశీరవ
సంగతముగ శ్రీశుకాభిసంజ్ఞితుఁ జేసెన్.

క. సద్యస్సంవర్ధితతను
హృద్యుఁ డగు శుకు నుపనీతుఁ బొనర్చి వ్యాసుం డం
చాద్యర్థ్యనుమతిఁ జేసెన్
విద్యార్థి, గురూపసదనవిధిపూర్వముగాన్.

క. దండము కృష్ణాజినము క
మండలువు దివమ్మునుండి మహా కేతేరన్
బండితమునులకుఁ గన్నుల
పండువుగా శుకవటుండు వాసి గ్రహించెన్.

క. వ్యాసుండు శుకుని వేదా
భ్యాసిం బొనరించి వివిధశాస్త్రాచార్యునిన్
వ్యాసంబు చేయు నాతం
డాసంపూర్తిగ గ్రహించె నన్ని చదువులున్.

## పురూరవుని చరిత్రము

క. ఈ యద్భుత శుకజననం
బా యమివరు లాలకించి, యనఘా, సూతా!
యే యోజఁ బ్రభుఁ బురూరవు
నాయూర్వశి పరిభవించె? నది తెలుపు మనన్.

తే. బ్రహ్మశాపోపహతి నరభావ మొంది
యూర్వశి పురూరవు వరించె; నూర్జిత మగు
నతనిగుణరాశిచే విజితాత్మ యయ్యు,
నామె, ముందుగ నిటు సమయంబు చేసె. ౧౩౦

క. రాజా! యీ మేషద్వయ
మేజాలియుఁ బొందనీక యీక్షింపవలెన్,
భోజన మాజ్యమె నాకున్,
నే జూడఁగరాదు నగ్నునిఁగ నురక నినున్. ౧౩౧

క. ఈ సమయంబుల నేదేఁ
జేసిన భంగంబు నిన్ద్యజించెద నపుడే;
నీసమ్మతి దెలుపు, మనం
జేసె బురూరవుఁడు నామె చెప్పిన ప్రతినన్. ౧౩౨

ఉ. అంతఁ బురూరవుండును నిరంతర మూర్వశిరూపముగ్ధుఁడై
యంతిపురంబులో నుపవనాంతరభూములఁ గేళిదీర్ఘికా
ప్రాంతములందు శైలములఁ బ్రస్రవణంబు లుపత్యకంబులం
దెంతయుఁ దృప్తి లేక రమియింపఁ దొడంగెఁ దదేకచిత్తుఁడై. ౧౩౩

శా. యజ్ఞంబుల్ తలపెట్టఁ డొక్కపుడుఁ, బ్రదేతాగ్నుల్ భజింపండు, వి
ద్వజ్ఞుల్ దిక్కుల నింపఁ బంపఁడు, జనాహ్లాదంబు గావింపఁ, డా
ప్రజ్ఞుండై త్యజియించెఁ గర్మములు ధర్మంబుల్ మనఃశాంతి నకం,
బజ్ఞుండట్లు పురూరవుండు సుమబాణావర్తసంవర్తియై. ౧౩౪

క. ఒక్క నిమేషం బేసియు
నక్కమలేక్షణవియోగ మసహము గాఁగా
నొక్కొక్క మూర్వశివలపునఁ
దక్క సమస్తంబు మఱచెఁ దన్మయుఁ డగుచున్. ౧౩౫

క. కొన్నేళ్ళు గడవ నిట్టుల
నున్నపురూరవునిఁ గూడి యూర్వశి భువిలోఁ,

జిన్నంబోయెను దివి; యది
గన్న సురేశుండు పల్కె గంధర్వులతో. ౪౩౮

క. ఊర్వశి లేనిది చక్షుః
పర్వంబుగ లేదు, శోభ వదలె దివము, మీ
రుర్వికిఁ జని వడిఁ గొనుఁడీ
యూర్వశియురణముల రాజునుక్తి చెడంగన్. ౪౩౯

క. గంధర్వులు నటు పలుకు సు
ధాంధఃపతియానఁ దరలి రప్పుడ యిలకున్.
గంధవహు మించు నురువుస,
సంధిల విశ్వావసుండు సర్వాగ్ర్యుండై. ౪౪౦

తే. అది కఠోరతమిస్ర, విహాయసమునఁ
గాలకాదంబినీమాల కాఱుకొనియెఁ;
గటిక చీకటి దిక్కులఁ గ్రమ్మె; నప్పుడు
వేరియుండె నూర్వశినిఁ బురూరవుండు. ౪౪౧

తే. ఆ మహాగాఢతర తమిస్రాంతరమున
నూర్వశీమేషయుగము గంధర్వవరులు
నెరపుమై హరించి; రా యురణములును,
నజచుచుం బోయె మింట నమ్మా యటంచు. ౪౪౨

మ. అమ్మా యనుచు విహాయసాగత తదీయాక్రందనాదమ్ము శ్రో
త్రమ్ముల్ సోఁకినమాత్ర నుల్కిపడి పాదం బాదిగా మస్తకాం
తమ్మున్ దేహము మాతృభావము సముద్భ్రాంతంబుగాఁ గోపహా
సమ్ముల్ క్రమ్మఁగఁ బల్కె నూర్వశి విభున్ సంకానురాంతంకయై.

ఉ. ఓయి పురూరవా! వినవటోయి యదే యురణార్భకమ్ము ల
మ్మా యని సంస్తుతశ్రుతుల మాటికి మాటికి నన్నుఁ బిల్చుచుం
గూయుచునోయి! నాకడుపు కోయుచు మోయుచు నున్నదోయి! నీ
నాయితతద్రవమ్ము; నిను నమ్ముట నెంతటి బేల నైతిరా! ౪౪౪

ఉ. నీ వొక పూరుషుండ వని నే భ్రమఁగొని, నివి నేను గాను స
న్నా వని నమ్మి, మూఢమతి న్యాసము సేసితి మేషయుగ్మముం
నీవశమందుఁ, బుత్రులుగ నే నివి సాఁకుదుఁ, జేతకాని దీ
నావనదీక్షఁ బూని యిటు లర్వాము నిద్దురఁ దోఁగ స్త్రీగతిన్? 81

ఉ. అనుడు లాలకించి మదనాలసభావము మాని యూర్వశీ
ధ్యాననిమగ్నుఁడై తొలఁగు నంబరమే సరిచేసికొక యూ
స్తేనులఁ బట్ట సంభ్రమగతిం బర తెంచెను మింట మేషన
ద్ధానుగతిన్ నిలుండు నిలుఁ డం చదలించుచు రాజు వారలన్. 82

క. వీడినపుట్టం బెఱుఁగక
నూడం బర తెంచు రాజుకోపమునకు వా
రోడుచు విశ్వావసుముఖు
లూడనిఁబాడిరి వదలి తదురణద్వయమున్. 83

ఉ. రోజుచు వెంట నంటెడు పురూరవు నూర్వశి చూచున...వి
భ్రాజితమా తటిల్లత నెలార్చుచుఁ బాటెరె దేవయోను ...
రాజును గాంచి నగ్ను సురరామ ప్రతిజ్ఞ విభంగ మయ్యె నన్
వ్యాజముతో యథేచ్ఛ జనె వారసి ప్రేముఁడీ విస్మరించుచున్. 84

క. ఆ రెండు మేకపిల్లలఁ
దీఱని తమకమునఁ జేరఁదీసి మృదువుగా
గీరుచు గోళులఁ బుణికి పు
రూరవుఁ డురమునఁ గదించి యోలత వచ్చెన్. 85

క. వచ్చి నిజమందిరమ్మున
నచ్చాసం గానలేక యంగజవశుఁడై
తచ్చిత్తత విహ్వలుఁడై
యుచ్చై ్రరావంబుతోడ నూర్వశి యంచున్. 86

క. త్రిమ్మరుచు దేశదేశము
నిమ్మహి సర్వంబు నెదకి యెంతయు వ్యధతో

వ. సూతుం డి ట్లనియె.

మ. అమృతాంభోనిధిసూతి శ్రీవనిత తోడై పుట్టు జైవాత్రుకుం
డమలజ్యోత్స్నలసామి దైవతసుధాహారాత్ముఁ డుద్యత్కళా
సముపేతుండు సరోజనాభునకు సాక్షాన్నేత్ర మాతండు చం
ద్రమసుం డొప్పు నుతింపఁగాఁ గువలయాహ్లాదుండు రాజాద్యుఁడై.

క. తారాయోషాసంగతి
నారాజుకుఁ గలిగె సుతుఁడు, నతనికి బుధుఁ డన్
పే రుంచఁగ సార్థకముగఁ
బేరెక్కె బుధుం డటంచు విద్యల నతఁడున్.

క. ఆతని సుత ద్యుమ్నుం డను
భూతలపతి సత్యవాది బుధనుతుఁడు గలాఁ,
డాతం డొకయెడ మృగయా
ప్రీతిన్ సైంధవము నెక్కి వెడలె నడవికిన్.

క. కతిపయ పరివారముతో
నతఁడున్ వేటాడె ధనువు నాకర్ణాంతం
బు తివిచి శరప్రమోచం
బతివిస్మయముగ నొనర్చు చానందముతో.

క. తిరుగుచు రురు మృగ శశ సూ
కర నికరము వ్యాఘ్ర మహిష ఖడ్గ గవయములన్
శరభంబులు సింహంబులు
నఱకుచుఁ జేరెం గుమార నామక వనమున్.

ఉ. మేరువుమూలమునం దది యమేయమహత్త్వము వల్లు దివ్యమం
దార మధూక రాజితము దాడిమ చంపక నారికేళ వి
స్తారము మాధవీ పనస సాల తమాల తతంబు రాజపుం
సారవనాదితంబు భ్రమరాళిరుతం బభిరామసీమమై.

క. అందముం బూచిన తరువుల
యందంబుం గంచుఁ గోకిలార్భటి వించున్
విం దైన నతఁడు సేవక
బృందముతో నా వనప్రవేశ మొనర్చెన్. ౪౬౫

తే. అక్కజంబుగ సుద్యుమ్నుఁ డాక్షణంబ
స్త్రీస్వరూపమ్ముఁ బొంది భాసిల్లె నట్లు
వనితలై రొప్పె నతనిసేవకజనంబు,
బడబగా మాఱె నతనియశ్వమ్ము గూడ. ౪౬౬

క. ఏ మిది యని రాజర్షి యి
దేమిటికి, నుపాయ మేది, యెవ్వఁడు శరణం,
బేమాడ్కి గృహము సొత్తును,
నేమించెద రాజ్య మెట్లు నే నని వగచెన్. ౪౬౭

వ. అన విని విస్మయావిష్టులై య ట్లగుటకుం గతం బేమి? సవిస్తరంబుగఁ దెలుపు మని యడిగిన ఋషులకు సూతుం డి ట్లనియె. ౪౬౮

తే. పూర్వకాలం బొకానొక పుణ్యవేళ
నీవనంబున దర్శింప నెంచి గిరిశు
నరుగు దెంచిరి సనకాదు లాదిమునులు
దిశలు వెల్గించుచుం దమ దివ్యరుచుల. ౪౬౯

తే. గిరిశునింగూడి క్రీడించు గిరిజ లజ్జ
నిలిచినం గాంచి ఋషు లందుఁ దొలఁగి చనిరి;
ఈ వనము చొచ్చినట్టివా రింకమీఁద
స్త్రీ లగుదు రంచు శాసించె నీలగళుఁడు. ౪౭౦

క. ఎఱిఁగినవా రెల్లరు నటు
లరుగ కుపేక్షింతురు కాని యా సుద్యుమ్నుం
డెఱుఁగక కుమారవనముం
జొరుటన్ స్త్రీభావ మందెఁ జొచ్చినక్షణమే. ౪౭౧

క. చింతించుచు నుండఁగనే
దొంతరలై సిగ్గుతెరలు తోఁచె సహజమై
కాంతకువలె సర్వాంగము
కాంతంబై హావభావకలల వెలింగెన్. ౪౭౨

తే. ఆననము నిర్గమించి యందందుఁ జెలులఁ
జేరి విహరింప నిళ యని పేరు నెలసె;
యునకుఁ డా చంద్రసూనుఁ డా యువతి బుధుఁడు
చూచె నొకవేళ నామెయుఁ జూచె బుధుని. ౪౭౩

క. వారికి నపు డన్యోన్యము
వారని యనురాగ మెదల వర్ధితె మైనన్
వారలసంయోగమునఁ బు
రూరవుఁడు జనించె భాస్వరుం డయి కాంతిన్. ౪౭౪

క. అంతట నిళ తనదశకై
చింతించుచుఁ స్వకులగురు వసిష్ఠు స్మరింపన్,
అంతికమున గోచరమై
యంతయు వృత్తాంత మెఱిఁగె నాతం డిళచే. ౪౭౫

తే. సర్వతంత్రస్వతంత్రుఁ డా సన్మునీంద్రుఁ
డభవు సేవించి యతనిఁ బ్రీతాత్ముఁ జేసి.
పురుషభావంబు ప్రాపింపఁ దిరిగి యిళకు
విశ్వశంకరు శంకరు వేఁడుకొనియె. ౪౭౬

క. సకరుణముగ హరుఁ డనెఁ బక
పక నగి యెటు లన్నృత మగును బలుకు మదీయం,
బొక నెల యువతిగ నిళయు మ
ఱొక నెల సుద్యుమ్నుఁ డనఁగ నొగిఁ బురుషుఁ డగున్. ౪౭౭

తే. కులగురునన్నుగ్రహమునఁ జేకొని వరంబు
రాజు స్వగృహంబుఁ జేరి పాలనము చేసె;

నొక్క నెల నేల యేలు నత్యూర్జితముగ;
నంతిపురి నొక్క నెల కాంతయై యుండును. ౪౭౮

ఆ. అట్టి నృపునిఁ గాంచి యఖిలప్రజలుఁగూడ
సంతసింపఁదైరి స్వాంతములను;
యౌవనంబు ప్రాప్త మైన పురూరవుఁ
జేసి రాజుఁ దాను చేరె వనము. ౪౭౯

క. సుద్యుమ్నుఁ డట నవాక్షర
విద్యన్ నారదమునివలన విద్యోతితుఁడై
తద్యోగద్యోతిత శ్రీ
విద్యోదగ్రోద్యతా ద్యవిద్యుం డయ్యెన్. ౪౮౦

క. అతనిభక్తికి శ్రద్ధకు,
నాతని యమనియమములకు నాతనిధృతికిన్,
ప్రీతాత్మ యగుచుఁ జండిక
యాతనికిం గోచరించె నద్భుతరుచితోఁ. ౪౮౧

శా. సింగం బెక్కి మనోజ్ఞకాంతులు దిశాసీర్ణంబుగా, వీరమున్
శృంగారంబును మూర్తిగా, నెదుటఁ దోఁచెన్ ఘూర్ణలోలాక్షియై,
బంగారం బగు మేనితోఁ బవడపుం బాదాధరచ్ఛాయతోఁ,
రంగారం గల నీలకేశములతో, రాజద్విభూషాళితోఁ. ౪౮౨

క. పరమేశ్వరి దివ్యాకృతి
కర మరుదుగఁ జూచి రాజఖండితభక్తిన్
శిర సొగ్గి నమస్కృతి యా
చరించి బహుమార్గములను సంస్తుతి చేసెన్. ౪౮౩

మ. ఒకచో నింతిగ నొక్కచోఁ బురుషుఁడై, యొకొక్కచో రెండునై,
సకలంబైన చరాచరప్రకృతిగా సంభావ్యమై, యందులో
నొకఁడుం గాక వెలుంగు దేవి తెలుఁగన్ యోగ్యుండు వాఁడొండెయౌ
నొకమాసం బిళయై మఱొక్క నెల సుద్యుమ్నుండునై యుండుటన్.

క. దేవి ననేకవిధంబులఁ
గావించియు స్తుతులు నతులు గడుఁగడుఁ బ్రీతిన్
దేవీసేవాసౌభా
గ్యావాప్తి యొకండె యాతఁ డర్థించె నుమన్. ౭౮౫

తే. ఆమహాదేవి సుద్యుమ్ను నమలభక్తి
యుక్తికిన్ మెచ్చి యాత్మసాయుజ్య మొసఁగె;
నంబికాప్రసాదముకల్మి నతఁడు చేరెఁ,
బరము, మునులకు నందని స్థిరపదమ్ము. ౭౮౬

## శుక కృత సంసార నింద

క. ఆకథ శౌనకముఖముని
లోకము విని మెచ్చి శ్రవణలోలత యొసఁగన్,
ఆకరణి జన్న శుకుకథ
నాకర్ణింపంగ వేఁడు కయ్యెడు ననఁగన్. ౭౮౭

వ. సూతుం డిట్లనియె. ౭౮౮

తే. శుకుఁ డటుల దేవగురునికుంతికమునందు
బ్రహ్మచర్యవ్రతాళి సర్వంబు నెరపి,
వేదవేదాంగధర్మశాస్త్రాదు లెల్లఁ
జదివె సరహస్యముగను ససంగ్రహముగ. ౭౮౯

చ. గురుకులవాసమిట్లు లనుకూలసమాప్తి మొనర్చి, యిచ్చియున్
గురున కభీష్టదక్షిణ, శుకుండు సమావృతుఁడై ప్రియంబుగాఁ
దిరిగి నిజాశ్రమంబు కరుదెంచినఁ, బుత్త్రునిఁ జూచి ప్రీతుఁడై
శిరమును మూర్కొంచ డిగె క్షేమము వ్యాసుఁడు మాటిమాటికిన్.

క. అతివేగంబున వ్యాసుఁడు
సుతుని నన్యాశ్రమిగ నుంటఁ జూచి, నరించెన్
అతనికి దారగ నొకముని
పతఁ గన్యన్ శుచినితాంతశోభనఁ గాంతన్. ౭౯౧

శా. పారాశర్యుఁడు ప్రేమ మీఱ సుతుఁ బిల్వం బంచి యంకస్థలిన్
జేరందీసి శిరంబు మూర్కొనుచుఁ బాణిం జుంచుపై దువ్వుచున్
గారాబంబున రాయుచున్ జుబుక మానందాశ్రుధారల్ ఝరీ
పారంపర్యత జాఱ యంగములు ముంపం బల్కె నీరీతిగన్. ౪౯౨

శా. ఎంతో ఘోరతపంబుచేఁ గలిగితోయీ కుఱ్ఱ! నా కెంతయున్
సంతోషంబుగ నేర్చినాడవు శ్రుతుల్ శాస్త్రంబులున్ ధర్మముల్,
కాంతం జేకొని పుత్త్రుఁ గాంచి మఱియున్ గార్హస్థ్యధర్మంబునన్,
శాంతుం జేయు పితౄణబాధవలనన్ నన్నున్ భవత్పూర్వులన్.

మ. జననం బాది విరక్తుఁడౌ శుకుఁడు వ్యాసప్రోక్త సంరక్తి దీ
పనవాక్యంబులు గొల్ప నచ్చెరువుఁ, దా భాషించె; నేఁ దత్త్వబో
ధనమర్థించి సమాశ్రయించితిని వేదవ్యాస! ధర్మజ్ఞ! శి
ష్యుని శాసింపవె, యానతిన్ శిరమునన్ యోజింతు మాటేటికిన్? ౪౯౩

వ. వ్యాసుం డిట్లనియె. ౪౯౬

క. శతవర్షతపమ్మునఁ బశు
పతి నారాధించి నిన్నుఁ బడసితి, నొకభూ
పతి వేడి తెత్తు విత్తము,
సతిఁ గొనుమా యౌవనంబు సఫలము గాఁగన్. ౪౯౭

వ. శుకుం డిట్లనియె. ౪౯౮

తే. ఏమి సుఖ ముండఁ గలదో వచింపు, తండ్రి!
యీ మనుష్యలోకాన నిరామయంబు;
సుఖము దుఃఖవిద్ధము యైన సుఖ మటంచు
నెయ్యెడం బల్కఁబోరు గదయ్య ప్రాజ్ఞ! ౪౯౯

సీ. వనిత గ్రహింపఁ దిద్వశుఁ డౌను, సుఖ మేడఁ
బరతంత్రునకును స్త్రీవశున కందు?
లోహ కాంక్ష నిబద్ధుఁడును విముక్తుం డగు,
సుతసతీబద్ధుఁ డేనారిదిఁ గాఁడు;

వపువులే విణ్మూత్ర భవనము, లం దంగనా
తనువులు విప్రేంద్ర! తన్మయంబు;
లట్టి నారీదేహ మనుభవింప బుధేంద్రుఁ
డెట్టి ప్రీతిం బొంద నిచ్ఛగించు?
నే నయోనిజుండ, నేలాగు రతి కల్గు
యోనిసుఖమునందు నో మహర్షి!
యాత్మరతుఁడ నగుచు నాత్మలో రమియించు
నాకుఁ దుచ్ఛరతుల పోక లేల? ౫౧౦

ఉ. వేదములుం దదంగములు వింటిని శ్రీగురులొద్ద, నైన నా
ఖేదము తీఱ దయ్యె, భవభీతి ననన్యశరణ్యుఁడనై భవ
త్పాదము లాశ్రయించితిని, దత్త్వము దెల్పి యనుగ్రహింపు, దే
వా! దయ పూని భీకర భవాబ్ధిఁ దరించు నుపాయ మెద్దియో! ౫౧౧

సీ. భవవిభ్రమణమందుఁ బవలు రేలుఁ జరించు
రవికట్లు దివిని విశ్రమణ మున్నె?
తత్త్వంబు చింతింపఁ దండ్రి! సంసారుల
సుఖము పూరుషుల కీటసుఖము గాదె?
వేదశాస్త్రంబులు విధి నభ్యసించియు
రాగియౌ వాఁడు మూర్ఖపశుసమానుఁడు;
మానవభవ మొంది మానఁడే రాగంబు
పత్నీగృహాదులఁ బండితుండె?
మూఁడు మాయాగుణంబులతో దెలుంగు
వాఁడె మేధావి బహుశాస్త్రపారగుండు;
గ్రహణముం జేతఁ బూరుషు గృహ మటంచు;
రయ్యొ! సుఖ మేదఁ గారాగృహమ్మునందు? ౫౧౨

వ. వ్యాసుం డి ట్లనియె. ౫౦౨

క. గృహ మనఁ బోలదు బంధన
గృహమును, దత్కారణంబు; కేవల మెద ని
స్పృహమై విముక్తుఁ డౌ నెడ
గృహస్థుఁ డేనియు విముక్తికిం జాలు శుకా! ౫౦౩

క. సత్యము తప్పక శుచియై
నిత్యము వేదోక్త శ్రాద్ధ నియమాదిక స
త్కృత్యములచే గృహస్థుఁడు
స్తుత్యము క్రమముక్తి గాంచు సుమ్మీ, వత్సా! ౫౦౪

శా. వానప్రస్థుఁడు బ్రహ్మచారియుఁ బరివ్రాట్టైన మధ్యాహ్నమం
దేనాఁడుం దము తామ కోయుచును నేఁ డేడంచు సాంసారికా
స్థానవ్రాతము లాశ్రయింతురు గదా! సంసారులే లేని నో
జ్ఞానుల్ సద్వ్రతశీలు రెట్లు తనుసంత్రాణంబు సాధింతురో? ౫౦౫

తే. వత్స! గార్హస్థ్యమునకంటెఁ బరతరంబు
నెందు ధర్మంబుఁ జూడము, నెందు వినము;
జ్ఞాను లాచార్యులు వసిష్ఠసన్మునీంద్రుఁ
డాదిగా నాశ్రయించి రా యాశ్రమంబె! ౫౦౬

క. ఏమి యసాధ్యము వేదో
క్తామలవిధి నెరపువాని కిహపరములలోఁ?
గామించిన సజ్జన్మం
బే మోక్షము స్వర్గ మేది యేని లభించున్. ౫౦౭

సీ. ఒక యాశ్రమము వెన్క నొక యాశ్రమము పొంద
యుక్త మంచును ధర్మరక్తు లందు;
రటుగాన నీవును నగ్ని సంపాదించి,
శ్రద్ధతో సతముఁ గర్మము లొనర్చి,

దేవతలను బిత్రుదేవతలను మను
ష్యులఁ దనియించి విధ్యుక్తరీతి,
ధర్మజ్ఞుఁ బుత్త్రు నుత్పాదించి, యాతని
గార్హస్థ్యవిధుల సంకలితుఁ జేసి,
యంతట గృహం బెడలి వనస్థాశ్రమంపు
వ్రతము గైకొని పిమ్మట యతివి తుదకు
నగుట యోగ్యంబు, పిన్నప్రాయంబునందె
సంన్యసించుట యది సమంజసము గాదు. ౫౦౮

క. ఎఱుఁగవు తండ్రీ! యింద్రియ
దురంత దుశ్చేష్టితములు తూలించు నరున్;
మఱియు నపత్నీకున కవి
భరింప సాధ్యములు కాని బరువులు వత్సా! ౫౦౯

క. కావున నింద్రియవిజయము
కావింపఁగ ధర్మపత్ని గ్రహియించి విధుల్
సేవించి ముదిమిఁ దపమున్
గావింపుఁ డటంచు శాస్త్రగణములు పలుకున్. ౫౧౦

క. ఎఱుఁగవె విశ్వామిత్రుఁడు
పరాశరుండున్ మహానుభావుఁడు విధియున్
తరుణీవశతం జిక్కిరి
వరియింపుము కన్య, నాదుపలుకులు వినుమా. ౫౧౧

వ. శుకుం డి ట్లనియె. ౫౧౨

ఉ. ఒల్లనయా గృహం, బది మహోద్ధురవాగుర, సౌఖ్య మందులోఁ
గల్ల, ధనాతురుం డెటు సుఖంపడ సాధ్య మగున్? జగత్త్రయీ
వల్లభుఁ డింద్రుఁ డేని పలుపాట్లు పడున్ దప మింత చేసినం
దల్లన నడ్డు వచ్చుచు, సుఖాత్ముఁడు నిస్పృహభిక్షు వోక్కఁడే.

చ. సుఖ మెఱుఁగండు బ్రహ్మ మధుసూదనుఁ డేని మనోహరేందిరా
సఖుఁ గొన నేర్చియుం బరమ సౌఖ్యము నందఁ డనేకయత్నస
మ్ముఖుఁ డయి యుద్ధముల్ సలుపు మూర్ఖనిశాటులకో, ధనాధిరా
ట్సఖుఁడు తపం బజస్రమును సల్పుట దుఃఖమె యంచు నెంచెదన్.

ఉ. లోలుపుఁ డైనచో ధనికుఁడున్ సుఖనిద్ర క్షణంబు పొందఁగాఁ
జాలఁ, డిలన్ దరిద్రుఁ డొక సౌఖ్యము నొందుట సాధ్యమౌనె, యిం
కేల మహాత్మ! నీ వెఱిఁగి యెర్గియు సంసృతిదుఃఖజాలస
మ్మేళన సేయ నిట్లు నియమించెదు నన్ను భవత్తనూభవున్? ౫౧౫

క. దుఃఖము జన్మము, జరయుం
దుఃఖము, మరణంబు నొంద దుఃఖము, మరలన్
దుఃఖము గర్భావాసము,
దుఃఖమయం బీ జగత్తు కీ సంసృతిచే. ౫౧౬

శా. భార్యాపుత్రులు పౌత్రులుం బరిజనుల్ భారంబుగాఁ దన్నుఁ గో
ద్ధుర్యత్వంబున లోభతృష్ణల మహాంధుం డౌచు సంపన్నులన్
ఆర్యా! దేహి యటంచు దీనముఖుఁడై యాచించు విద్వాంసుఁ డే
మర్యాదం గను? నిత్యమున్ మరణశుంభద్దుఃఖముం బొందఁడే!

క. ఏకోదరునిం జింతలు
సోఁకవు, వాఁ డెట్లో కడుపు సుష్ఠుగ నింపున్,
జేకొని మూలమ్ములనో,
యాకలములనో ఫలములనో, యాఁకలి యడఁగన్. ౫౧౭

తే. కర్మకాండంబున మదాత్మ కనదు రక్తి;
పలుకు ప్రారబ్ధ సంచిత వర్తమాన
కర్మ లవి మూఁడు క్షీణించు మర్మ మేదొ,
యోగమో జ్ఞానమో యవ్యయోత్సవంబు. ౫౧౮

క. జలగవలెన్ నిరతంబును
లలన తనూరక్త మెల్ల లాలనఁ బీల్చున్;

దెలియక మూర్ఖుఁడు భ్రమపడు
లలితము లగు భావచేష్టలన్ మోహితుఁడై. ౹౹౨౦

క. గొంగ హరించును విత్తమె,
యంగన భోగముల బలము నైశ్వర్యంబున్
రంగైన సుడుల మనమున్
దొంగిలు సర్వమ్ము; నన్నుఁ ద్రోయకు మందున్. ౹౹౨౧

ఉ. ఈ విధిఁ బల్కు పుత్రునినిరీహత కెంతయు దుఃఖితాత్ముఁడై
భావన చేసె వ్యాసభగవానుఁడు నేమి యొనర్తు నంచు, నా
పావనమూర్తికన్నుల నవార్యములై ప్రవహించె నశ్రువుల్
మై వడఁకెన్ మనస్సు కడు మ్లానత నొందె నెసంగె గ్లానియున్.

తే. అట్లు శోకపరీత దీనాత్ముఁ డగుచు
వగచు జనకుని ముని భగవానుఁ గాంచి
విస్మయోత్ఫుల్ల నేత్రారవిందుఁ డగుచు
శుకుఁడు తలపోసె నిట్లు వ్యాసుండు వినఁగ. ౹౹౨౩

క. ఆహా! మాయాబల మిది
మోహంబునఁ బండితుల నె ముంచెడి బలిమిన్;
మోహితుఁగా వేదాంత
వ్యాహర్త శ్రుతిప్రమాణు వ్యాసు నె చేసెన్. ౹౹౨౪

శా. ఏ దీ మాయ యి దెంత దుష్కర? విమోహీభూతునిం జేసె నీ
వేదవ్యాసుఁ బురాణకర్త జయసంవిద్వక్తఁ బారాశరిన్
శ్రీదైత్యారికళాంశసంభవు జగత్ క్షేమంకరాకారు, నే
నా దేవిన్ శరణంబు చొచ్చెద నమేయన్ ధ్యేయ మాయామయన్.

ఉ. ఏమన నౌ నహో! బల, మ దెంతటి వీర్య మహో, ప్రభుండు మే
ధామయుఁ డీశ్వరుం డితఁడు ధైర్యము దక్కి విభగ్నపోతుఁడై
భ్రామిలు ప్రాకృతాపణికుభాతిఁ దదీక్షణనిర్మితాత్మమా
యామయ వార్ధి మగ్నుఁ డయి యట్టిటులై యురలించు నశ్రువుల్.

తే. బ్రహ్మ విష్ణు హరాదులే భ్రాంతు లైన
నెవఁడు మాయావశుండు గాఁ డీత్రిలోకి ?
నితఁ డెవఁడు? నే నెవండ ? ని దెట్టి భ్రమము ?
పాంచభౌతిక దేహ సంబంధ మేమి ? ౫౨౭

తే. సర్వకారణకారణ, సర్వదేవ
జనని, బ్రహ్మాదులకును నీశ్వరిని, దేవి,
మఱిమఱి శుకుండు మనసా నమస్కరించి,
పలికె నిటు తండ్రి శోకవిహ్వలునిఁ గాంచి. ౫౨౮

క. అందఱకు బోధ చేసెడి
నిం దెలుపం దరమె నాకు? నే నీ జనిలో
నందనుఁడ నైతి నీ, కా
ముం దెవరమొ తెలియ వశమె? మోహ మి దేలా? ౫౨౯

ఆ. అన్నపానములన యాఁకలి దగ తీఱు,
బుత్త్రదర్శనమునఁ బోవునొక్కొ?
శ్రవణగంధములను జెవియు ముక్కు రమించుఁ,
బుత్త్రుఁ గాంచి తనివిఁ బొందఁ బోవు. ౫౩౦

క. పుత్త్రునికంటెన్ ధనమే
పాత్రము సాధింప సుఖము; పశువుగ నుండం
బుత్త్రు నజీగర్తుఁడు మును
ధాత్రీపతి కమ్మలేదె ధనలోభమునన్ ? ౫౩౧

ఉ. సంసృతివాసనా భయద జాల నిబద్ధము కాదు బుద్ధి, వి
ద్వాంసుఁడ వన్యదుర్లభభవం బిది నాది కృతార్థ మహానటుల్
ధ్వంసముగా మదాత్మఁ గల ధ్వాంతము, చీఁకటి పాఱఁద్రోలు నా
హంసుఁడువోని జ్ఞానకలికార్ద్రరుచుల్ వెలిఁగింపు నాయెదన్. ౫౩౨

## శ్రీ దేవీ భాగవతావతరణము

తే. బుద్ధిమంతుఁడు వ్యాసునిపుత్రుఁ డిట్లు
శాంతుఁడై తురీయాశ్రమిసదృశబుద్ధి
నడుగఁగ శుకుండు, వ్యాసమహర్షి మిగులఁ
బ్రీతుఁడై పల్కె నాదరస్మితుఁ డగుచు. ౪౩౩

చ. చదువు శుభంబు భాగవతసంహిత పుత్రక! బ్రహ్మసమ్మితం
బది, శుక! పంచలక్షణసమన్వితకోశము నాతిదీర్ఘమై
నది, పదిరెండుస్కంధముల నయ్యది వెల్గుఁ, బురాణరాశి క
య్యదియె విభూషణంబు, కలయన్నిట నా కభిమానపాత్రమున్.

క. అది విన్నంతన నరునకు
సదసద్జ్ఞానము వివేకచతురత గలుగున్;
మొదలన్ దాని నెఱింగెను
సదమలమతి యచ్యుతుండు; చదువుము నీవున్. ౪౩౪

మ. హరి వటపత్రగర్భమున నర్భకుఁడై శయనించియుండి య
బ్బురపడి చింత సేసె, నెటు పుట్టితి? నాజనయిత్రి యెవ్వ? రే
పరికరజాతజాతుఁడను? బాలుఁడ నేటకుఁ గారణం బెదో?
యెఱుఁగుట యెట్లొ? సర్వము చిదేకరసం బిది యంచు వ్యగ్రుఁడై.

తే. అట్లు చింతించెడి ముకుందుఁ డాలకించె,
నీ సమస్తమహంవాచ్య మేన సుమ్ము;
ఇతరము సనాతన మ్మైన దేమి లేద;
అను నఖిలధాత్రి శ్లోకార్థ మంబికోక్తి. ౪౩౬

ఉ. ఆ శుభవాణి శౌరి హృదయాబ్జములోఁ బదిలంబు సేసి, యా
పేశలసత్యవాక్కవరిప్రేరణ వర్తిలెఁ? బుంనపుంసక
స్త్రీశమొ, యె ట్లెఱుంగు టని చింతిలి, భాగవతంబు నెమ్మదిన్,
శ్రీశుఁడు కాంచి మాటికి జపించి దృఢం బొనరించెఁ దచ్ఛ్రితిన్.

ఉ. ఆయెడ నామహాత్మవిమలాత్ములకుం బొడకట్టె లక్ష్మి శాం
తాయతనేత్రయై వరశుభాంబరభూషణయై చతుర్భుజా
ధ్యాయిత శంఖ చక్రకగదాబ్జ మహాయుధయై మృదుస్మితా
ప్యాయసితాస్యయై స్వసదృశాత్మవిభూతిసఖీసమాఢ్యయై. ౨౩౯

క. రతి భూతి బుద్ధి కీర్తియు
స్మృతి మతి స్వధ స్వాహా శ్రద్ధ మేధయు దయయున్
ధృతి జృంభ తంద్ర నిద్రయు
గతి లజ్జయుఁ బుష్టి తుష్టి క్షమయున్ క్షుధయున్. ౨౪౦

క. వరభూషణాంబరాయుధ
ధరలై మందారమాల్యదాపితశిఖలై
యిరువది యొక్కరు శక్తులు
పరివేష్టింపంగఁ జక్రి పరికించె శివన్. ౨౪౧

తే. ఆ నిరాధారమైన యేకార్ణవమున
సఖులఁ గూడి మహాలక్ష్మి శాంతరమ్య
మందహాసంబు పరగింప మాధవుండు
గాంచి విస్మితుఁ డగుచుఁ జింతించె నిట్లు. ౨౪౨

ఉ. మాఱుచుగ నున్నది యుదధి, మానిను లెట్లుదయించినారు, నే
నీయెడ నుంటి నేల, యువ కెందుల కిట్టిట నుంచినారు, నా
కీఱుమ గేమి కానలయు, నెవ్వరొ, యేటికిఁ గానవయ్యె, నే
దే యనవచ్చునో, తగవొ, యే విట నుందునొ, వెళ్ళిపోదునో?

క. ఏ మొనరించిన నే మగు
నేమో తెలియంగఁ జాల, నేల విచారం
బీ ముగ్ధబాలభావము
తో మానం బూని యుండుదున్ నిశ్చింతన్. ౨౪౪

తే. అట్లు వటపత్ర చిత్ర శయ్యాంతరమున
బాలభావంబు ధరియించి పవ్వళించి

విస్మయోన్ముగ్ధుఁ డగు మహావిష్ణుఁ గాంచి
దేవి సస్మితయై పల్కె నీవిధాన. ౫౪౫

క. ఏలా విస్మయ మందెద
వీలాగున, నన్ను మఱచు టే మబ్బుర మా,
లీలామాయాశబలిత
హేలాబ్రహ్మంబుచేత నీరిత మిదియున్. ౫౪౬

క. నే నీ సాత్త్వికశక్తిని
గానా, నిన్నెపుడు విడువఁ గాదె ముకుందా!
నేనున్ నీతో మఱిమఱి
పూనుదు జన్మంబు సృష్టిపూర్వం బెపుడున్. ౫౪౭

శా. నీనాభిన్ జనియించి బ్రహ్మయుఁ దపోనిష్ఠన్ రజశ్శక్తి సం
ధానాత్ముం డయి రక్తరంజనకళాధారేయుఁడై లోకమున్
దా నిర్మించు, మనస్సు నైదయిన భూతశ్రేణిఁ బంచేంద్రియ
శ్రేణిన్ దక్కు పదార్థసంచయముతోఁ జెల్లున్ జగత్సృష్టియై. ౫౪౮

క. లోకము సృజించు నిటు విధి;
లోకము రక్షింతు వీవు; భ్రూప్రభవుండై
లోకస్రష్టకు, రుద్రుఁడు
లోకము కల్పాంతవేళ లోఁగొను హరుఁడై. ౫౪౯

ఉ. నీహృదయాబ్జపీఠమున నిత్యము నే ననపాయనై దృఢ
స్నేహమునన్ వసించెదను, నీవశవర్తిని నై, సురారిసం
దోహ మదాపహర్త్రి నయి, తోడయి యుండి జయంబు గూర్తు, సం
దేహము మానుమా, కనుఁ దేరి కనుంగొను నన్ను సాత్త్వికిన్.

ఉ. మంగళదేవివాక్యముల మాధవుఁ డెంతయుఁ బ్రీతి నొంది ప
ల్కెం గమలేక్షణా! వినఁబడెన్ మును నాకు స్ఫుటాక్షరంబుగాఁ
గం గమనీయగీతము సగంబు శివంబు పరంబు గోప్యమం
చుం గనుపట్టు నెవ్వరివచోవిధి యయ్యది చెప్పవే సతీ! ౫౫౧

ఆ. పేద కలను గన్న పెన్నిధియుంబోలె,
మరల మరల దాని స్మరణసేతు,
మనన సేతు దాని మఱిమఱి మనసులో,
మరులు గొన్న ప్రణయపరువిధాన. ౫౫౨

క. హరిమధురవాక్యముల నా
వరవర్ణిని యాలకించి పరమప్రీతిన్
చిఱునవ్వొలయ ముఖంబునఁ
బరికించి మనోహరముగఁ బల్కెను హరితోన్. ౫౫౩

ఉ. ఓయి చతుర్భుజా! యెఱుఁగుదోయి గుణాన్విత నౌట నన్నుఁ, గా
నీ యెఱుఁగంగ నేర వల నిర్గుణ నా సగుణాలయన్ముని
ధ్యేయను మూలశక్తి భువనేశ్వరి, నా పరమేశి సుమ్ము నీ
కాయెడ సర్వగీతము దయన్ వినిపించినయట్టి దమ్మయిన్. ౫౫౪

శా. ఆ శ్లోకార్థము విన్చి భాగవతగుహ్యార్థప్రకాశంబు నో
సుశ్లోకా! యొనరించె నీపయిఁ గృపన్, శోభాస్పదం బద్ది, శా
స్త్రశ్లాఘ్యం బది, వేదసార మది, విస్మార్యంబు కా దద్ది, పు
ణ్యశ్లక్ష్ణం బది, రక్షణీయ మది, దివ్యంబుం బరం బచ్యుతా! ౫౫౫

మ. హరి! నీ వెంత యదృష్టశాలి వవుదన్నా! యా మహావిద్యయే
కరుణాపూరతరంగితాత్మ యయి వాగ్రత్నంబు విన్పించె నీ
కరవిందాక్ష! త్రిలోకిలోన నల శ్లోకార్థంబుకంటెం బరం
బెఱుఁగ నొప్పినది లేదు, దేవికిని నీ వెంతేఁ బ్రియుండౌ దొహో!

తే. ఆ మహాలక్ష్మివాక్యంబు లాదరించి,
యది మహామంత్ర మను నిశ్చయమునఁ గుదిరి
హృదయకుహరాంతరమున ధరించి దాని
నెల్లవేళ జపించుఁ బద్మేక్షణుండు. ౫౫౭

ఉ. అంతటఁ గొంతకాలమున కాతనినాభి జనించి బ్రహ్మ దే
వాంతకభీతి విష్ణు శరణాగతుఁ డైన, మహారణంబు వి

క్రాంతి నొనర్చి, శౌరి మధుకైటభుల౯ మథియించి మించి య
త్యంతరతి౯ జపించె విశదాక్షర మా మనుగీతికార్థము౯. ౫౫౮

తే. అట్లు జపియించుహరిఁ గాంచి యా విరించి
యపుడు ప్రశ్నించె, నీచేయు జప మ దేమి?
యెవ్వారి స్మరించి యెడఁద రమించుచుందు?
వఖిలజగదీశ! నీకంటె నధికుఁ డెవఁడు? ౫౫౯

వ. నావుడు శ్రీహరి యి ట్లనియె. ౫౬౦

క. ఎందును భగవతి నీ నా
యందుఁ గ్రియాకారణాత్మ యగు శక్తి వెలుం
గొందుఁ, దదాధారంబై
పొందు౯ రూపంబు జగము పూర్ణాంబుధియు౯. ౫౬౧

ఉ. ఈ సచరాచరాత్మజగ మెల్ల నదే సృజియించు, నాపరా
ఖ్యా సముదీర్ణ శక్తియె యనాది ప్రసన్నయె యైన మోక్షసు
శ్రీ సమవాప్తిహేతు వయి చెల్లు నదే, మఱియు౯ నరాళిక౯
శ్రీసకలేశ్వరేశ్వరియె నిచ్చలు సంసృతిబంధహేతువౌ. ౫౬౨

తే. అట్లు చిచ్ఛక్తిసంభవం బం చెఱుఁగుము
నేను నీవు విశ్వ మెల్ల, నిశ్చయ మిది;
భాగవత మది గీతార్థపరము నాకుఁ
బల్కె, నది విస్తృతం బగు ద్వాపరాది. ౫౬౩

క. అని కరుణించిన హరి, దా
నిని గ్రహియించెను విరించి; నీరజజుఁడు, సం
దను నారదు దీక్షించెను;
మునికులమణి యతఁడు నాకు బోధించె దయ౯. ౫౬౪

సీ. దాని నేఁ జింతించి ద్వాదశస్కంధంబు
గా విస్తరించితి దేవిచరిత;

బ్రహ్మసమ్మితమది పంచలక్షణయుక్త
పుణ్యపురాణమ్ము, పూతచిత్త!
వేదార్థసారంబు వేదాంతసారంబు
ధర్మశాస్త్రసమంబు శర్మదంబు
వృత్రాసురవధాది వివిధకథాఢ్యంబు
భాగవతాఖ్య దివ్యత్పురాణ;
మది పఠించిన వినినఁ బుత్రార్థదంబు,
పరమశాంతి దీర్ఘాయుష్యకరము శివము,
జ్ఞానవిబోధ మజ్ఞాననాశకం బ
పార సంసార వారాశి తారణంబు. ౫౬౫

తే. అది పదెన్మిదివేల సంఖ్యం దలిర్చు
శ్లోకములఁ బొల్చు; దాని సుశ్లోక! నీవు
సంగ్రహించి ధరింపు హృత్సారసమున,
వినెదు నీతోడ రోమహర్షణి యతండు. ౫౬౬

వ. సూతుం డిట్లనియె. ౫౬౭

ఆ. వ్యాసుఁ డిట్లు పల్కు భాగవతం బెల్ల
శుకునితోడ నాకు శ్రుత మొనర్చె;
నేను దాని రత్ననిధివోలె గ్రహించి
హృది ధరించినాఁడ దృఢనియుక్తి. ౫౬౮

వ్యాసుండు శుకుని జనకునిఁ జూడఁ బంపుట

క. శుకుఁడు పురాణము వినియును
వికలుం డేకాంతమౌనవృత్తియు నగుచుం
వికసన దొలఁగిన నది గని
యొకనాఁ డీ ట్లనియె వ్యాసుఁ డొద్దిక శుకుతోన్. ౫౬౯

ఉ. ఏల శుకా! నిరంతరము నిట్లు ఋణార్దితనిర్ధనుండునుం
బోలె నితాంతచింతఁ గను మాసి తపించెదు? నీకుఁ దండ్రినై
బాలక! నేను గల్గఁగ లవంబు కొఱంత యొసంగఁ జాలునే?
చాలు, లగింపుమీ యెద నచంచలకీలిక జ్ఞానదీపికన్. ౫౭౦

తే. ఐన శాంతింపదేని మోహము త్వదాత్మఁ,
జనుము మిథిలాధినాథుని జనకు నడుగ;
నాతఁడు విదేహరాజర్షి యఖిలవేత్త
తథ్యవాక్కు జీవన్ముక్తధర్ముఁడు శుచి. ౫౭౧

వ. అనుడు శుకుం డిట్లనియె. ౫౭౨

క. అన్నా! యచ్చెరువయ్యెడి
నున్నే వంధ్యాసుతుండు నుర్వీస్థలిలోఁ?
దిన్నది తినకున్నదియగు,
జన్నది చనకున్న దగుట సాధ్యమె యెందున్? ౫౭౩

క. ఏవిధి రాజగు నాతఁడు
జీవన్ముక్తుఁడు విదేహచిహ్నుండును నౌ!
నేవిధిఁ జోరుఁడు ముని యగు,
నా వాఁడున్ వైరి యనెడి జ్ఞానం బుడుగున్? ౫౭౪

క. శీతోష్ణంబుల సుఖదుః
ఖాతురతం గనక యబ్జమట్లు జలములం
దేతీరున నంటక గృహి
యాతం డున్నాఁడొ చూడ నద్భుతమయ్యెన్. ౫౭౫

క. దండింపక దుష్టాత్ముల
నుండం గలఁ డెట్టు లేలు నుర్వీపతి? యు
ట్టిం డెటు ముక్తుం డనఁ బా
త్రుం డగు? నది చూడ నేగుదున్ గురుదేవా! ౫౭౬

